# ప్రతిఫలం
## (నాటికలు)

రచన :

సుంకర సత్యనారాయణ

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

# మనవి

నా నాటకపు ప్రథమసంపుటి "వీరకుంకుమ" ఫిబ్రవరిలో వెలువడింది. దానిని సహృదయంతో స్వీకరించిన ఆంధ్రప్రజలకు నా అభివందనాలు.

ఇప్పుడు రెండవ సంపుటిగా ఈ "ప్రతిఫలం" వెలువడుతోంది.

ఇదివరకు నా నాటికలకు స్థానమిచ్చి ప్రచురించిన నగారా, అభ్యుదయ, ఆంధ్ర (వార) పత్రికల సంపాదకులకు, వీటిని సంపుటంగా ప్రచురించుతున్న విశాలాంధ్ర ప్రచురణాలయం వారికీ నా అభివందనాలు.

ఆంధ్రప్రజలు "వీరకుంకుమ" ను ఆదరించినట్లే 'ప్రతిఫలా"న్ని కూడా ఆదరిస్తారని, నా కృషి సాఫల్యం కాగలదని ఆశిస్తున్నాను.

— సుంకర.

## పాత్రలు:

చింతాలు : వ్యవసాయకూలీ

మల్లయ్య : పేదరైతు

రమణారావు : భూస్వామి

పంతులు :

కాంతమ్మ : పేదరైతు భార్య

సీతమ్మ : పొరుగింటి స్త్రీ

## పల్లెటూరు

సమయం : ఉదయం 6 గంటలు

స్థలం:- పేదరైతు ఇంటుముందు వసారా, ఒకమూల చిన్నమంచం స్టూలు వుంటాయి. రెండోమూల బర్రెదూడ కట్టివేసి వుంటుంది. కాంతమ్మ ప్రవేశం. పేదరైతు భార్య. వయస్సు 40: బలహీనంగా వుంటుంది. నడిమి చించి కుట్టినచీర కట్టుకుంది. ఇల్లు వూడుస్తూ వుంటుంది.

చింతాలు ప్రవేశం. వ్యవసాయకూలి. వయస్సు 30. చినిగినబట్టలు మాసినగడ్డం, బనియన్, తలగుడ్డ, చేతిలోకర్ర, కాళ్ళకు చెప్పులు.

చింతా- కాంతమ్మగారూ! దొరగారు ఉండారా?

కాంత- లేరు చింతాలు!

చిం- పొద్దున్నే ఎక్కడికి కెళ్లినట్టబ్బా!

కాం- ఇప్పుడే నీళ్ళకావిడి దింపి, అట్టా బజారుకు వెళ్ళారు. ఎందుకయ్యా?

చిం- ఏముంది దొరసాని, నారుతీతకి, నిన్న కనబడి ఎక్కడన్నా పని తగిలితే నన్నుకూడ పిలవరా అబ్బాయి అన్నారు అందుకని...

కాం- (చీపురు కిందపడవేసి నముడు పైకెత్తుతూ) ఏం నారు తీతో నల్లబొగ్గులో. ఆమనిషి ఏం పాపంచేసి పుట్టారో, ఒక్కనాడు సుఖంగా తిని పడుకున్న పాపాన పోలేదు. ఎప్పుడూ చాకిరే, పాడు చాకిరి. హుఁ (వంగి చీపురు అందుకుంటుంది)

చిం- పిచ్చితల్లి. ఆయన చెయ్యని పాపమంటూ ఒకటివుందా!

కాం— (నిలబడి చింతాలువంక ఎగాదిగా చూస్తూ) ఏంటి చింతాలూ? అట్టంటావ్. నువ్వు నిజంగానే అంటున్నావా?

చిం— నిజంగానే,

కాం— (కొంచెం కోపంగా) నిజంగానా, ఏంటది? ఎక్కడన్నా తప్పుడు సాక్షాలు చెప్పారా? కన్నా లేశారా? మూటలు మోశారా? ఎవడి పెళ్ళాం తాడన్నా తెంచారా? తాగి తందనా లాడారా?

చిం— (నిట్టూర్పుతో) ఆ పాపాలన్నిటికీ వడికట్టకపోవటమే, ఆ దొరచేసిన పెద్ద పాపం.

కాం— (ఆశ్చర్యంగా) అదేంటి చింతాలు, అడ్డమైన గడ్డి కరవక పోవటం కూడ తప్పేనా?

చిం— (గంభీరంగా) తప్పుకాదు, తప్పున్నర.

కాం— ఆటే చూస్తే, నీకు మతి చెడ్డట్టుంది చింతాలు. ఇది నీ పుర్రెకు పుట్టిన బుద్దేనా, ఎవరన్నా నేరిపారా?

చిం— ఎందుకు నేరపట్లల్లా, బడిపెట్టి మరీ నేరుపుతున్నారు.

కాం— ఎన్నాలనుంచి?

చిం— మూడేళ్ళనుంచి

కాం— ఎవరు?

చిం— ఎవరుండారు, అందులో ఆరితేరిన వస్తాదులే.

కాం— ఏంటి చింతాలు! నీకేమన్నా పిచ్చిబట్టిందా?

చిం— కళ్ళారా చూస్తా, చెవులారా వింటావుంటే పిచ్చి ఏంటి తల్లీ! వూళ్ళో చిన్నబ్బాయిా, పల్లెలో మూడుముంతలోడూ నాయకర్త లయ్యారు. మొగోళ్ళయ్యారు.

కాం- మూడు ముంతలా డెవరో ?

చిం- నువ్వెరగవు దొరసానీ, కోటడని వుట్టికి మూడుసేర్లు తెగిన సన్నాసి ఒకడు ఏడిశాడు.

కాం- అదేంపేరు ?

చిం- ఎవరు మూడుముంతలు పోయిస్తే వాళ్ల ఎనకమాల కుక్కను మల్లే తిరుగుతా వుంటాడు. అందుకని ఆపేరు వచ్చింది. వాడి అసలుపేరు ఎవరికీ తెలవనే తెలవదు. ఇక చిన్నబ్బాయంటారా ? మీరు ఎరిగిన సామేగా.

కాం- ఎవరు రామయ్యగారి అబ్బాయా ?

చిం- ఊఁ ఆయినే. ఏదో ఒక గలాటా లేంది ఆ దుర్మార్గుడికి తెల్లారదు. తాగుడు, జూదం, కన్నా లెయ్యటం అన్నిట్లోనూ మొనగాడుబిడ్డ.

కాం- ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెళ్ళిచేసుకుంటె కుండలన్నీ పగల కొట్టిందంట! ఇట్టాంటి నడమంతరపు మూకకి పెత్తనం ఇస్తే ఏంచేస్తారుమరి ? ఆచిన్నబ్బాయ్ మోడు ఎప్పుడూ ఆ పెళ్లాన్ని ఇరకొట్టడతా వుంటాడు. వాడి కేం వచ్చిందో.

చిం- ఇదివరకు ఆ ఇల్లాలిని చెండుకు తినేవాడేమో, ఇప్పుడు అదేం అన్న ఆడదాన్నీ మగవాణ్ణీకూడ సావబాదు తున్నాడు. ఆయన ఆడింది ఆట, పాడింది పాటగా వుంది.

కాం- ఎవడు ఎట్టా చస్తే మనకేం గాని, వాడిపేరు తలవబోకు బాబు. ఇప్పుడు నారాయణా అంటంకూడ పాపంగానే వుంది.

చిం- ఎంత కాలమని ఓపిక పడతాం కాంతమ్మ గారు ?

కాం- ఏంచేస్తాం నాయనా! కాలానికి కట్టుబడి వుండాలిమరి.
ఎవడిపాపాన వాడే పోతాడు. పైన దేవుడులేడూ !

చిం- ఏంవుండాడో మరి. చివరికి ఆ దేవుడూ లంచం మేశా
డేమో ! ఈపాపమంతా చూస్తా వూరుకుంటున్నాడు.

కాం- (ఆశ్చర్యంగా) ఆ తంట్రా లంచం మేసేది !

చిం- ఆయనవేంటి, ఆయన తలదన్నిన మొనగాళ్ళూ అసలు
ఆయన్ని పుట్టించిన దొరలు మేస్తావుంటే దిక్కు
లేదుగాని !

కాం- ఏమో, అంతా అయోమయంగా వుంది చింతాలు !

చిం- ఇందులో అయోమయం ఏముంది ? అద్దానికిమల్లే కళ్ళ
ఎదుట కనపడతా వుంటేను.

కాం- ఏం కనపడతావుందంటావ్ ?

చిం- మనబోటి పేదల్ని బదకనిచ్చేటట్టు లేరని.

[మల్లయ్య ప్రవేశం. ఇంటి యజమాని. వయస్సు 60. నీర్కావిపంచ. పైన వుత్తరీయం. చొక్కా వుండదు. నడుం కొంచెంగా వంగింది]

మల్ల- (లోనికి ప్రవేశిస్తూ, చింతాలు మాటవిని) మంచిమాట
చెప్పావ్ చింతాలు ! నూరేళ్ళు బతుకు. నేను నీకోసం
పోయాను. నువ్వు ఇక్కడికివచ్చావా ?

కాం- నారు తియ్యటానికి వస్తానన్నారంటగా ?

మల్ల- అవును (చింతాలువైపు చూస్తూ) ఎవరికి చింతాలు ?

చిం- ఏవూరివాళ్లో రమణయ్యగారి మళ్లో నారుకొన్నారు.

మల్ల- ఏపాటి ?

చిం- బస్తా ఇత్తులమడి.

మల్ల - అయితే ఎప్పుడు పోదాం ?

చిం- ఎప్పుడో నా ! రెండు మెతుకులు తిని...

మల్ల - అట్టాగే.

కాం- ఏంపోతారులెండి అట్టావుండారు.

మల్ల - ఆ రెండు చెక్కలూ దున్నించి నాలుగు మొక్కలు పాతిపెట్టేసరికి, పాతికరూపాయల అప్పు అయింది. ఈ పదిరోజులూపోతే అది తీరతందిగదా అని.

కాం- (భర్తవైపు దీనంగా చూస్తూ) అప్పు అద్దానమూ. (చింతాలుకూడా మల్లయ్యవేపు దీనంగా చూస్తూ వుంటాడు.)

మల్ల - (చింతాలువైపు తిరిగి) దాని మాటలకు ఏంగాని, నువ్వు అన్నంతిని రా చింతాలు ! ఇంతలో నేనూ రెండు మెతుకులు తింటాను.

చిం- తిన్నగా మీరు మడికాడికి రండి.

మల్ల - సరే (చింతాలు వెళ్లిపోతాడు.)

కాం- తన మాట తనకేగాని ఒకరు చెప్పినమాట వినటం ఏనాడూ లేదుగా.

మల్ల - అవ్వాకావాలి, బువ్వాకావాలి, అనుకుంటే ఎట్టా కుదురుతుందే. "పెద్దమ్మాయికి నిండు నెలలు; తీసుకొద్దామూఅనుకుంటే చేతిలో ఎర్రనిఏగానీలేదు. ఇంట్లో ఇత్తులూలేవు" అని రాత్రి గంటన్నర గోణిగావు. ఇప్పుడు ఇట్టా ఏడుస్తావేం ?

కాం- సరె, ఇంటో లేనిది లేదనుకున్నా తప్పేనా ? అదీ నాకే వచ్చింది ! దానికి ఈ సిచ్చన్నమాట.

మల్ల – (బర్రెదూడను అవతల కట్టివేస్తూ) సిచ్చొలేదూ నీ మొఖమూలేదు, తొందరగా అన్నంపెట్టు.
కాం– (ఊడవడం పూర్తిజేసి) వండాలి చలిదిఅన్నం లేదు.
మల్ల – లేదా? తొందరగా వండు మరి.
కాం– బియ్యం లేవుగా ?
మల్ల – లేవా?
కాం– తేవాలి (బయటకు పోతూవుంటుంది).
మల్ల – ఎక్కడికి ?
కాం– చాట అప్పుకి! ఏతల్లినన్నా అడిగి కాసిని బియ్యం తెచ్చి పొంగిద్దామని. మీ పని తీరిపోతే, తరవాత చూచుకో వచ్చు. (అంటూ వెళ్ళబోతుంది)
మల్ల - ఆగు (ఆగుతుంది) నా పని తీరిపోతే సరా! నీకు అన్నం అక్కరలేదా ? వస్తుంటావా (అంటూ ఆమె దగ్గరకు వెళ్ళతాడు)
కాం– ఓపూట వస్తువుంటే చచ్చిపోతానా ? నేను చేసే పని ఇతాయి పోతందా ?
మల్ల!– ఇప్పుడు నువ్వు అప్పుతెచ్చి, వండి నాకు పెట్టా !
కాం– ఎంతసేపు; ఇప్పుడు పొంగించనూ.
మల్ల – పొంగించవని కాదు. పొద్దున్నే సోలెడు బియ్యంకోసం ఒకర్ని దేవిరించటం ఎందుకా అని. పుటిక్కిని వాళ్ళు లేవంటే ప్రాణం చస్తుంది. ఎందుకొచ్చిన గొడవ.
కాం– అయితే ఎట్టామరి ?
మల్ల – (కాంతమ్మ తల నిమురుతూ) కాసిని మజ్జిగ తీసుకురా, తాగిపోతాను. (కాంతమ్మ భర్తవంక దీనంగాచూస్తూంది)

ఫరవాలేదు తీసుకురా. నీవు జొన్నలు తొక్కేవంటు చేసేసరికి రానేవస్తాగా. నామాట విను.

(కాంతమ్మ దీనంగా తలవంచుకొని లోనికి వెళ్ళుతుంది. మల్లయ్య యేదో దీర్ఘంగా ఆలోచిస్తూ వుంటాడు. వెనుక నుంచి రమణరావు ప్రవేశం. భూస్వామి. వయస్సు 40. ఖద్దరు పంచలు, ఫుల్ షర్టు, బట్టతల. చేతిలో వంకికర్ర, గడియారం, కాళ్ళకు చెప్పులు)

రమ- (ప్రవేశించి) ఏం, బాబాయ్! దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ ?

మల్ల- (త్రుళ్ళిపడి) ఆఁ ఆఁ ఆఁ ఏంలేదు. (అంటూ మూల నున్న స్టూలు ఇవతలకు లాగి తన పై పంచితో దాన్ని దులిపి తెచ్చి తగిన స్థలంలో వేస్తూ) కూచో నాయనా.

రమ- ఊడుపు అయిందా బాబాయ్! ఈయేడు ఏంనారు పోశావ్ ?

మల్ల- కుసమ.

రమ- కుసమా! అదెందుకు పోశావ్, నీచేనుకు "నెంబర్లు" చాలా బాగుండేది.

మల్ల- నిజమే, కాని ఎక్కడ తిరిగినా నారు దొరకలా. ఏం చెయ్యను. దొరికింది పాతిపెట్టాను.

రమ- దొరక్కపోవడం ఏమిటి? నన్నడిగితే నీకు నారుతక్కువ అయ్యేదా? బోలెడంత మిగిలింది. అడ్డమైనవాళ్ళు తీసుకుపోయి పోశుకున్నారు. ఇక నీవడిగితే లేదనే వాణ్ణా ? ఏం బాబాయ్ ఇట్లాచేశావ్ ?

మల్ల- ఏదో అయిపోయింది ఇప్పుడేంచేస్తాం. (కాంతమ్మ తెల్ల తప్పేలాతో మజ్జిగ తీసుకుని ప్రవేశిస్తుంది.)

కాం_ రమణారావు అబ్బాయ్, ఏదో పనిమీద వచ్చాడే మనింటికి. ఎప్పుడో పెద్దమ్మాయి పెళ్ళి కనుకుంటాను, మనగడపతొక్కింది. (అంటూ మజ్జిగ తెపాలా భర్త కందిస్తుంది)

రమ_ అవునుపిన్నీ! క్షణంతీరదు. ప్రొద్దునవెళ్ళి వూరు మాటు మణిగిన తరువాత ఇంటికివస్తాను. (మల్లయ్యవంకజూచి) ఏం బాబాయ్! పొద్దున్నే మజ్జిగ తీసుకుంటున్నావ్.

మల్ల_ వూరికినే బాబూ!

కాం_ తెల్లవారిపాటికి మీ అందరికీ కాఫీ కావలసివస్తే మీ బాబాయికి మజ్జిగ కావాలి.

రమ_ (వెకిలిగానవ్వి) ఊఁ. సరేగాని తెల్లవారేసరికి చింతాలు నీదగ్గరకు వచ్చాడెందుకు బాబాయ్?

మల్ల_ నాకోసమే.

రమ_ నీకోసమా? ఆ కసాయికి నీతో ఏంపని?

కాం_ మేము, చింతాలు ఎంతో మంచివాడనుకుంటాం. నీ వట్టంటావేం నాయనా?

రమ_ (వికటంగా నవ్వుతూ) వాడిసంగతి ఏంతెలుసు మీకు పిన్నీ! నల్లతాచు.

మల్ల_ నేను వాణ్ణి చిన్నప్పటినుంచి ఎరుగుదును. కూలీ జనంలో చింతాల్ను చెప్పి మరొకర్ని చెప్పాలి. బుద్ధిమంతుడు.

రమ_ ఇదివరకు నేనూ అలాగే అనుకునేవాణ్ణి. కాని ఈ మధ్య వాడు గొంతులు కొయ్యటానికికూడా తయారవ్వు తున్నాడు తెలుసా?

కాం_ (ఆశ్చర్యంగా) గొంతులా? ఎవరిని?

రమ_ ఎవరినో కాదు, నన్నూ, బాబాయిని.

మల్ల- (రమణారావువైపు తేరిపారచూస్తూ) నన్నా ?

రమ_ నిన్నంటే నిన్ను కాదనుకో బాబాయి. నన్నే.

మల్ల- నిన్నుమాత్రం ?

రమ_ నీకు తెలియదు అదంతా. చాలా గూడుపుఠానీ వుంది.

కాం_ నిజమే నాయనా! కుడుమిస్తే పండగను కుంటారు.

మల్ల- చింతాలంటే గిట్టని వాడెవడో నీతో చెప్పివుంటాడు.

రమ_ అదేంగాదు. అందులోని లోతూ పాతూ తెలుసుకో కుండా పైకి ఉబికే మనిషినేనా నేను. తగిన మనిషి ద్వారానే తెలిసింది.

మల్ల- ఏమోనబ్బా.

కాం_ (ఆదుర్దాగా) ఆ మనిషి ఎవరు బాబు ?

రమ_ ఎవడో చెప్పటమూ నేను నమ్మటమూనా! మనవాడే చెప్పాడు చిన్న బ్బాయి.

మల్ల- (నవ్వి) సరే. నమ్మకమైనవాడే.

కాం_ నమ్మక నమ్మక ఆ కోతిముండాకొడుకు మాటేనమ్మావా బాబూ ?

రమ_ కాదుపిన్నీ, వాడు వట్టికోతి. పైన దుర్మార్గుడు. కాని ఎంత దుర్మార్గుడైనా మనవాడు. అదిగాక ఇట్లాంటి రకానికే అట్లాంటి పాడువార్తలు త్వరగా తెలుస్తవి. ఇదివరకు ఒకటి రెండు వాడు చెప్పినమాటలు నిజమైనవి.

మల్ల_ చిన్ననాటినుంచి చింతాలును నేనూ ఎరుగుదును. నువ్వూ ఎరుగుదువు. వాడు ఫలానా నాడు ఫలానా చెడుపని చేశాడని చెప్పు చూద్దాం ?

రమ_ నిజమే ! ఇదివరకు వాడికి ఇట్లాంటి పాడుబుద్ధులు లేవు. కాని ఈమధ్య నేర్చుకుంటున్నాడు.

కాం_ ఎక్కడ ? ఎవరిదగ్గర ?

రమ_ వున్నాడుగా మనవూళ్ళో ఒక సన్యాసి.

మల్ల_ ఎవరు ?

రమ_ వాడే! ఆ నరసయ్య కొడుకు_నారాయణ, కూలీసంఘం అంటూ ఒకటి పెట్టి...

కాం_ ఇందులో కొత్త ఏముంది అబ్బాయ్. ఇరవై యేళ్ళనుంచి వాడిపని అదేగా ! ఉప్పు తెస్తానంటూ బయలుదేరి పోలీసులతో చావుదెబ్బలు తిన్నాడు. గాంధీగారి మతము పుచ్చుకుని రెండుసార్లు జైలుకుకూడా పోయాడు.

రమ_ నిజమే, వాడికి బాగుపడే యోగమే వుంటే అందులోనే వుండేవాడు.

మల్ల_ అప్పుడుమాత్రం నీవు వాణ్ణి మంచివాడన్నావా? ఇట్లాగే తిట్టేవాడివి. "ఈ ముండ స్వరాజ్యం తెస్తాడంట. పిచ్చి మూకనంతా పోగుచేసి మన జమీందారుకు వోటు యివ్వకుండా చేస్తున్నాడు" అనే వాడివి.

కాం_ స్వరాజ్యమో, పాడో ! జైళ్లునుంచి బయటికి వచ్చి నప్పుడు, ఆ బిడ్డను గుర్తుపట్టటమే గగనమయ్యింది.

అప్పుడు జండాదగ్గిర పోలీసులు పిచ్చిదెబ్బలు కొట్టారు ఆ అబ్బాయిని.

రమ- అట్లా అడ్డగోలుగా కొట్టబట్టే ఆ ప్రభుత్వం కూలిపోయింది.

మల్ల- ఇప్పుడూ అట్లాగే కొడతన్నా రంటగా ?

కాం- అయితే ఇదీ పోయేదేనా, ఏంటి ?

రమ- ఛా, ఇది ఎందుకు పోతుంది. ఇది మన ప్రభుత్వం.

కాం- తెలిసినవాడివి నువ్వూ అట్లామాట్లాడతావేంటబ్బాయ్. తప్పుపని ఎవరుచేసినా తప్పేగా ?

రమ- (కొంచెము విసుగ్గా) అప్పుడు దెబ్బలుకొట్టింది దేశభక్తుల్ని. ఇప్పుడు దెబ్బలుతినేది దేశద్రోహులు. తెలిసీ తెలియకుండా మాట్లాడకు పిన్నీ.

కాం- అవును, ఆడదానికి నాకేంతెలుసు. ఏపుట్టలో ఏపాముందో. అయినా నాకెందుకు ఈ గొడవ పోతాను. (లోనికి వెళుతూవుంటుంది)

రమ- ఉండు పిన్ని!

కాం- ఉంటానికి ఏంగాని, పొయ్యి రాజెయ్యాలి. సరేగాని, కాస్త కనిపెట్టి తిరుగుబాబూ. తరవాత ఏమనుకుంటే ఏముంది ?

రమ- కనిపెట్టి తిరుగుతూవుండబట్టే ఇప్పుడిక్కడకు వచ్చాను. తెల్లవారిపాటికి ఆ చింతాలుగాడు ఇక్కడకు ఎందుకు వచ్చాడో తెలుసుకుందామని.

మల్ల- నన్ను నారుతియ్యటానికి పిలుద్దామని వచ్చాడు. అంతేగాని...

రమ_ నారు తియ్యడానికా? ఎక్కడికి?

మల్ల_ నీనారు మడిలోకే.

రమ_ అయితే నీవు కూలిపనికి పోతున్నావా?

మల్ల_ (తలవంచుకొని) ఊం.

కాం_ (విచారంగా) జరగనప్పుడు ఏంచేస్తాం బాబు? (అంటూ లోనికి వెళ్తుంది)

రమ_ (లేచి మల్లయ్యదగ్గరకు నడుస్తూ) ఈ వయస్సులో కూలికి పోతున్నావంటే నాకు చాలాకష్టంగావుంది. అంతగతి ఏం పట్టింది బాబాయ్?

మల్ల_ నాటువేయించి వారంరోజులైంది. ఇంకా కూలీలకు దమ్మిడీ ఇవ్వలా. పావం వాళ్లు రోజూతిరుగుతున్నారు. నాలుగురోజులు పోతే అదయినా తీరుతుందేమోనని.

రమ_ వాళ్ళకురోగం. పదిరోజులు ఆగండిరా అంటే ఆగక చస్తారా?

మల్ల_ ఏపూట డబ్బులు ఆపూట నూరుకు తాగేవాళ్ళు ఏం ఆగుతారు?

రమ_ ఆగక గంతులువేస్తారా?

మల్ల_ ఇప్పుడు గాకపోతే రేపైనా ఇవ్వాలిగా, తప్పుతుందా? వూరికే తిప్పుకుంటేమాత్రం మనకు వొరిగేది ఏముంది?

రమ_ అట్టా అనుకున్ననాడివి నన్నడిగితే పదిరూపాయలు బదులు ఇవ్వక పోయానా? అంతేగాని, నీవు పుట్టిన పుట్టక్కి, పెరిగినపెరగడానికి, ఒకడికి కూలిచెయ్యడమా?

మల్ల_ డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు అన్నారు. ఏం చేస్తాను బాబు!

కాం- (వచ్చి మూలనున్న పిడకలు అందుకుంటూ) ఈ పూట దాకా పలానీ ఎల్లయ్యే తరవాతనే ఎవరైనాఅనిపించు కునారు. నేటికి ఆయనికి...

రమ- చూడుపిన్నీ! నీవు కంట తడిపెడుతున్నావా? వూరుకో. అంత ఇబ్బందిగా వుంటే మాటమాత్రం నాతో అనకూడదు.

మల్ల- (విచారంగా) నా కర్మకి ఒకరేం చేస్తారు బాబు!

రమ- ఏదో చేతనైన సాయం. అందులో మీరు పరాయి వాళ్ళా, నా రక్తబంధువులు. ఇదంతా ఎందుకుగాని ఒకపని చెప్పుతాను చెయ్యి బాబాయ్!

మల్ల- ఏం చెయ్యమంటావు బాబు?

రమ- ఇంతవరకు ఒకరితో మాటపడ్డవాడివికాదు. అడ్డమైన వాడితో కలిసి కూలిపనికి పోవటం దేనికి? పుటిక్కని ఏ తలబిరుసుముండాకొడుకో ఒకమాటంటే?

కాం- (చింతగా) అంటే అనావచ్చు.

రమ- అవునుకదా, ఈ పీడంతా ఎందుకు? నీవు పనిచేయ్యనూ వద్దు. హాయిగా మన నారింజతోట కనిపెట్టుకొని వుండు. ఒకడికి ఇచ్చేదానికంటే ఇంకా రెండు రూపాయలు అదనంగా ఇస్తాను. అంతేగాని ఈ వయసులో ఎవడికో పరాయివాడికి కూలికి పోవటం అంత బాగు లేదు.

కాం- (సంతోషంగా) ఎన్ని చెప్పినా అయినవాడు అయినవాడే! పరాయివాడు పరాయివాడే. ఇంతమాత్రపు చల్లని మాట మరొకడనగలుగుతాడా?

రమ- (మల్లయ్యవంక జూస్తూ) ఏమంటావు బాబాయ్?
కాం- అనటానికేముంది బాబు! నీమాట ఏది కాదన్నారు.
రమ- ఏది ఎట్లావున్నా నీవు మాత్రం కూలిపనికి వెళ్ళకు బాబాయ్!
మల్ల- వస్తానని మాట ఇచ్చాను. ఈ పూటకు పోకతప్పదు. తరవాత సంగతి ఆలోచించుకుందాం.
రమ- మంచో చెడో నాకుతోచిన సలహా చెప్పాను. తరవాత నీ యిష్టం. సరే, వస్తాను. (వెళ్లిపోతాడు)
కాం- పెద్దతనం. ఇంకా ఎన్నాళ్ళు రెక్కలు ముక్కలు చేసుకుంటారు. రమణారావు మనవాడు. దేవుడల్లే ఇంటికి వచ్చి మరీ చెప్పిపోయాడు. ఆతోటకాడ పడుంటే ఏ చిక్కూ లేదు. ఆ అబ్బాయి మాట వినటం, ఎందుకయినా మంచిది.
మల్ల- మాటలు తియ్యగానే వుంటయ్.
కాం- అయినా వాళ్ళని నమ్మక ఇంకా ఎవరిని నమ్ముతారండి!
మల్ల- నా రెక్కల్ని.
కాం- ఎల్లకాలం రెక్కలే అక్కరకొస్తాయనా. రేపు కాలో చెయ్యో పడితేనో.
మల్ల- పైన దేవుడుంటాడు. (అంటూ వెళ్లిపోతాడు. కాంతమ్మ భర్త వెళ్లిన వైపుకు దీనంగా చూస్తూ పిడకలు తీస్తూ వుంటుంది. సీతమ్మ ప్రవేశం. వయస్సు 65. తలనెరిసింది)
సీత- (వీంగుళోనుంచి) అమ్మాయ్, కాంతమ్మా!
కాం- ఎవరు? (తొంగిచూచి) రా సీతమ్మత్తా.

సీత- (ప్రవేసించి) అబ్బాయి ఎక్కడ కెళ్లాడమ్మా ?

కాం- పొలాని కెళ్ళారు.

సీత- కాసేపు కాలుమడిసి కూచోడుగద బిడ్డ. ఎప్పుడూ ఏదో ఒక పనిచేస్తూనే వుంటాడు. ఈ కాలపు సన్నాసులు ఏం చేస్తారమ్మా ? ఒక్కనాడు పనికిపోయి మూనాళ్ళు పడుకుంటారు.

కాం- ఏం చేస్తే ఏం లాభం అత్తయ్యా ! నాలుగు ఎంగిలి కూతలు నేర్చినవాళ్ళది కాలం, పెత్తనమూ, అధికారమూ.

సీత- అధికారం అంటే జ్ఞాపకం వచ్చింది. ఆ సచ్చినాడు ఎక్కడా నిలిచేటట్టు లేడమ్మ.

కాం- ఏ చచ్చినాడు ?

సీత- ఆఁ వాడేనే, చిన్నసుబ్బాయి.

కాం- ఏం చేశాడేంటి ?

సీత- ఇంకా నీకు తెలవనేలేదా ?

కాం- ఊఁ హుఁ

సీత- మొన్న ఏదోసనిమీద లచ్చువమ్మ ఇంటికి పోయాను. పాపం! ఆ ఇల్లాలు చెప్పుకుని లబ్బున ఏడ్చిందమ్మ. నా కడుపు తరుక్కుపోయిందంటే నమ్ము.

కాం- ఎందుకు ? అసలు ఏం జరిగింది ?

సీత- అయిదారు రోజులనాడు పొద్దుగూకుమాటు దాని కూతురు దొడ్లో నీళ్లోసుకుంటా వుందంట.

కాం- ఏ కూతురు ?

సీత_ ఆఁ అదేనే, ఆ యేటవతల ఇచ్చిన పిల్ల. దానిపేరు ఏంటిరీ?

కాం_ జానకి.

సీత_ ఆఁ. ఆపిల్లే. నాలుగు చెంబులు పైన పోసుకుందో లేదో (గడ్డముమీద వేలువేసుకుంటూ) ఆ గున్న గోడ దూకి దొడ్లోకి వచ్చాడంట!

కాం_ ఏ గున్న?

సీత_ ఆ నడమంత్రపువాడె. చిన్నసుబ్బాయి.

కాం_ (ఆత్రంగా) ఊఁ ఊఁ.

సీత_ వాణ్ణి జూచి, ఆ పిల్ల గబగబ లేచి తుండు మొలకు చుట్టుకుని, "సీకళ్ళు పోయినయ్యా అవతలకిపో" అందంట వాణ్ణి. ఆ గున్న ఏమన్నాడో విన్నావా?

కాం_ ఏ మన్నాడు?

సీత_ నీ మొగుడే, మొగాడనుకున్నావా, నేనూ మొగాణ్ణే అన్నాడంట.

కాం_ ఆరి వాడి జిమ్మటియ్య. వాడికేమన్నా పొయ్యేకాల మొచ్చిందా! పట్టుకుని పక్కలు ఇరగదన్నలావాళ్లు?

సీత_ వాడి నెవరుతంతారే తల్లి! అసలు ఇప్పుడీవూరికి వాడే రాజు. ఏదో వుద్దేగమంట, వాడి వుద్దేగం వూడ్చి పెట్టుకుపోను. భూమిమీద నిలిచేటట్టు లేడు.

కాం_ ఆ తలకుమాసిన ముండాకొడుక్కు వుద్యోగం ఎవ రిచ్చారు? వుద్యోగముంటే, గోడలు దూకమన్నారా?

సీత_ ఇంకా నయం, మొన్న ఆ నారాయణ ఇంటో దూరి పచ్చడికుండల దగ్గిరనుంచి అన్నీ పగలగొట్టాడు. నాలుగువందలరూపాయల బంగార మెత్తుకపోయాడు.

పైన నారాయణ పెళ్లాన్ని కుయ్యేరాని కూతలు కూశాడుగా.

కాం_ వాడుపలికిన నోరు బద్దలవ్వ. ఏమొచ్చింది వాడికి ?

సీత_ నేను కొత్తగా కాపురానికి వచ్చినప్పుడు, ఈవూళ్లో ఇట్లాంటి చచ్చినాడే వొకడుండేవాడు. వాడి బాధ పడలేక వూరంతాకలిసి ఏం చేశారో తెలుసా ?

కాం_ తెలియదు.

సీత_ఒకనాడు పట్టుకుని చావకొట్టి కాలవలో పారేశారు.

కాం_ పీడవదిలింది. కళ్ళు కానకుండా తిరిగితే ఎవడిగతిఅయినా అంతే.

సీత_ పొద్దుకూకి ఆడది బయటికి పోయేదారి లేకుండావుంది ఎట్లాజస్తాం?

కాం_ ఏం చచ్చాడోకాని, ఇంతకీ ఏంపనిమీద వచ్చావ అత్తయ్యా ?

సీత_ ఏంలేదమ్మా గేదె ఎండిపోయి పదిరోజులయింది. పాడి చచ్చిపోతున్నాం. కాసిని బక్కనీలు పోస్తావేమోనని.

కాం_ దానికేంగాని, మాదీ ఒంటిపూట పడింది అత్తయ్యా కాసినన్ని ఇస్తే గిలకొడుతున్నా.

సీత_ నీచేతిమజ్జిగ కమ్మగా వుంటయ్యమ్మా, అందుకు వచ్చాను.

కాం_ పెద్దదానివి. అయ్యో కాసిని పోస్తానుండు. (అంటూ లేచి కాంతమ్మ లోపలికి వెళ్లుతుంది. సీతమ్మ అటూ ఇటూ పచారు చేస్తూ వుంటుంది. కాంతమ్మ మజ్జిగ తెప్పాలతో, ప్రవేశిస్తుంది.)

రాం– (తెప్పాల సీతమ్మ కందిస్తూ) నీళ్లకు మల్లే పల్చగా వచ్చినాయ్. పెద్దదానివి అడిగావని పొయ్యటమేగాని వుండికాదు అత్తా!

సీత– అవునమ్మా! నీవు మాటతీసివేసే మనిషివి కాదు. కనుకనే వచ్చాను. రమణారావు పెళ్లాం ఇన్నిమజ్జిగ పుట్టనివ్వదు. చూడబోతె మూసు గేదెలపాడి.

రాం– ఆమెనే చెప్పు. ఒక ఇరుగూ లేదు పొరుగూ లేదు. ఇల్లో నారాయమన్నా.

సీత– పోయేటప్పుడు కట్టుకు పోతుందా అదంతా?

రాం– కట్టుకుపోతారో, చుట్టుకుపోతారో మన కెందుకు? మన బతుకు మనం సరీగా చూచుకుంటె చాలు.

సీత– మంచిమాట అన్నావ్. పోతానమ్మా, (నాలుగడుగులు వేసి వెనుదిరిగి) అమ్మాయి కాంతమ్మా! నేను చెప్పిన మాట ఎవరితోనన్నా అనేవు. నీతో గనుక చెప్పాను. మరొక ఆడదానికైతే చెప్పనమ్మ.

కాం– నాకు ఆమాత్రం తెలియదా సీతమ్మత్తా!

[ సీతమ్మ వెళ్ళిపోతుంది. కాంతమ్మ లోపలికి వెళ్ళుతుంది. మల్లయ్య చింతాలు మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు. వారి గుడ్డలమీద అక్కడక్కడ బురదమరక లుంటాయి. ]

చిం– గొంతులు కోస్తానా! అవునుమరి అందుకనేగా మేడ గట్టాను.

మల్ల– అయ్యో! ఈ సంఘాల గొడవ ఎందుకురా అబ్బాయి, రెక్కాడితేనేగాని డొక్కాడదు మనకి.

చిం– డొక్కసరీగ్గా ఆడదుగాబట్టే సంఘం పెట్టుకుంది.

మల్ల- సంఘం ఆకలి తీరుస్తుందా?

చిం- సంఘం పెట్టుకొని నలుగురం ఒక మాటమీద నిలబ బట్టేగా కూలి పెరిగింది.

మల్ల- అదీ నిజమేననుకో.

చిం- అందుకనేగో రమణారావుగారు నన్ను కసాయి ముండ కొడుకంది. గొంతులు కోస్తానంది. అసలు ఆ దొరక నామీద ఇంతకోపం ఎందుకో తెలుసా మీకు?

మల్ల- నాకు అదీ తెలియదు, ఇదీ తెలియదు.

చిం- నిరుడెప్పుడో ఆకు దీసిన కూలి మొన్నటిదాకా ఆయ ఇవ్వనేలేదు. తిరిగి తిరిగి వూరుకున్నాం. మళ్ళీ ఇయ్యేడు నారు తియ్యమంటూ తయారయాడు దొర ఆపాట్న కూలీలందరం సంఘం ఆఫీసుకుచేరి ఆలో చించుకున్నాం. నిరుటికూలీ, ఇయ్యేటి కూలి సొంత ఇవ్వండే, రమణారావుగారికి ఒక్క మనిషి పోవద్దని కున్నాం. ఆయనగారు ఎత్తులమీద ఎత్తులు వేశాడ. పొరుగూరి కూలీలను తీసుకొద్దామని చూచాడ పప్పులుడకలా! చివరకు చచ్చినట్టు డబ్బుకట్టి మా చే పని చేయించుకున్నాడు. అది మొదలు ఆ దొర నేనంటే కంటు.

మల్ల- అదా సంగతి. సరేగాని చింతాలు! నన్ను తనతోటక కాపలా వుండమంటున్నాడు. ఏమంటావు?

[కాంతమ్మ ప్రవేశం]

చిం- మీరేమనుకుంటున్నారు?

మల్ల- (కాంతమ్మవైపు చూస్తూ) మీా దొరసాని వుద్దేశం వుండమనే.

చిం- అవునా కాంతమ్మగారు ?

కాంత-నిజమే చింతాలు! రమణారావు మీా దొరపడే ఇబ్బంది చూచి వుసూరు మన్నాడు. చివరికి ఈమాట చెప్పాడు.

చిం- అసలు మీాకా తోట సంగతి ఏమైనా తెలుసా ?

కాం- నాకేం తెలుసు.

చిం- ఏవూరునుంచో ఒక మనిషిని తీసుకొచ్చి ఆ తోటలో పెట్టాడు. ఆతను ఆ తోటని నాలుగేళ్ళు పెంచేటట్టూ, రమణారావుగారు అతనికి రెండు ఎకరాలు రాసి ఇచ్చే టట్టూ మాట్లాడుకున్నారు.

మల్ల- అట్టాగా అసలా తోట ఎంత ?

చిం- పది ఎకరాలు లెండి. పాపం ఆ మనిషినమ్మి రాత్రిపగలు చమట దారబోసి ఆ తోటని పెంచాడు. ఇది నాలుగో ఏడు. ఆ అబ్బాయివచ్చి ఈ యేడుకూడా గడిస్తే, రెండెకరాలు రాసియ్యాలిసి వుంటుందిగా. అందుకని రమణారావుగారు ఏదో పేచీ పెట్టుకొని ఆ పెదముండా కొడుకుని తరిమివేసి...

మల్ల- నన్ను ఉండమంటున్నా డన్నమాట; అదా !

కాం- పాపం!

చిం- పాపం, పున్నెం ఎవరిక్కా-వాలి తల్లీ !

మల్ల- ఆతోటలో పాదంబెట్టి నాడికి తప్పకుండ ఆపేదముండా కొడుకు పిల్లల వుసురు తగులుతుంది.

కాం- ఆతోట ఏ గంగలోనన్నా కలవనియ్యి. మనకొద్దు బాబు. పీడ.

చిం- అయినా, కాంతమ్మగారూ! ఆరమణారావుగారిమాటలు అన్నీ తెలిసుండే మీరెట్టనమ్మారండి? ఏదో తవ్వి తలకెత్తుతానసీ, పిల్లనిస్తానసీ మేనల్లుణ్ణి తీసుకొచ్చి యింట్లో పెట్టుకున్నాడు. చివరకి ఆ అల్లుణ్ణి ఏం ఉద్ధరించాడో అందరికీ తెలిసిందేగా!

కాం- ఎందుకు తెలవదు, అయిదారేళ్లు అరవచాకిరీ చేయించుకున్నాడు. చివరకి పిల్లనివ్వలేదు సరిగదా, పగిలిన రాగిదమ్మిడి ఇదిగో అని ఆ యబ్బాయి చేతులో బెట్టలా!

మల్ల- అవును, అందులో నేనేదో కలగజేసుకుని చెప్పబోగా నన్ను నానా పిచ్చికూతలు కూశాడు.

కాం- అరటిపండు వలిచి చేతిలోపెట్టినట్టు మాటలుచెప్పాడు. అదంతా దయేననుకున్నాను చింతాలు! పైన నిన్ను ఖూనీ కోరన్నాడు.

చిం- ఎందుకనడు. వెనకటికి రంకునేర్చినమ్మ బొంకనేరవక కొంక నక్కలపాలు అయిందంట! ఆ స్త్రీకోసం అన్నకొడుకుని చంపి ఎడ్లగాట్లో పెట్టిన రాచ్చసుడు నన్ను ఖూనీకోరన్నాడు.

మల్ల- చింతాలూ! ఆ గొడవ అంతా ఇప్పుడు ఎందుకుగాని, పదబాబు ఎండ ఎక్కింది.

చిం- పోతాను లెండి.

కాం_ నీవు ఏమీ అనుకోకుండావుంటే ఒక మాట చెప్పుతా చింతాలు !

చిం_ చెప్పుతల్లీ ? మిమ్మల్ని నేను వేరే అనుకుంటానా !

కాం_ నువ్వు మాయింటికి రావటం రమణారావు అబ్బాయికి యిష్టంలేదు. పదేపదే రాకుబాబు, నీకు మాకుకూడ మంచిది.

చిం_ నిండా మునిగినవాడికి చలిఏంటి ! అట్టాంటి భయాలన్నీ నేను ఎప్పుడో వదలుకున్నాను. సరే మీరు జంకు తున్నారుగనుక రానులెండి.

మల్ల_ కాస్తిదానికి కూస్తిదానికి ఈ పిచ్చిమొఖం వూరికినే కంగారు పడతంది చింతాలు !

చిం_ కొమ్ములుతిరిగిన మొగోళ్లు జడుస్తావుంటే కాంతమ్మగారి దేముందిలేండి. సరే, పోతాను. గొడ్లకు గడ్డి తెచ్చు కోవాలి. (చింతాలు నాలుగడుగులు ముందుకేస్తాడు)

మల్ల_ చింతాలూ! (చింతాలు వెనుదిరిగి చూస్తాడు.) సాయంత్రము గట్లు బాగుచేయటానికి వెళదామా ?

చిం_ పోదాంలేండి. (వెళ్లిపోతాడు)

మల్ల_ (కాంతమ్మవైపు చురచుర చూస్తూ) నీ తెలివితెల్లార ! అంత కటువుగానా మాట్లాడేది ? చింతాలు ఏమను కుంటాడు.

కాం_ నన్నా ! ఏమీ అనుకోడు. నా గుణం చింతాలుకు తెలుసు.

మల్ల_ చింతాలుగనుక సరిపోయింది. రేపు మరి వొకడు అవుతాడు.

కాం- అయితే ఏం? ఏమన్నాను? తిట్టానా తిమ్మానా.

మల్ల- పైన తిట్టటం కూడానా? అంతట నోరుముయ్యి. (బొడ్లోనుంచి రూపాయి తీసి) ఈ రూపాయికి బియ్యం తెమ్మంటావా?

కాం- నేను తెచ్చుకుంటాలెండి.

మల్ల- ఎక్కడ?

కాం- ఎక్కడో, మీకెందుకు మా ఆడవాళ్ళ గొడవ.

మల్ల- చెప్పకూడదా?

కాం- మాట నోరుజారితేసరి వదలిపెట్టరమ్మా. రమణారావు ఇంట్లో.

మల్ల- చాటుగా అమ్ముతుందా ఆవిడ?

కాం- అమ్మందే వెయ్యన్నర రూపాయలు మూటకట్టిందీ! అందరూ నాబోటి పిచ్చిమొద్దులే వుంటారా ఏంటి? (అంటూ భర్త చేతిలోని రూపాయ గుంజుకొని లోనికి పోతుంది. మల్లయ్య ఆమెవంక చూస్తూ వుంటాడు. బయటనుంచి 'మల్లయ్యగారూ' అని కేకవినపడుతుంది).

మల్ల- (అటుతిరిగి) ఎవరు? (వెట్టివాడు ప్రవేశం. పంచమడిచి మడిగోచిపెట్టి వుంటాడు. తలగుడ్డ, బనియను, కాళ్ళకు చెప్పులు, చేతులో బాణాకర్ర)

వెట్టి- (ప్రవేశించి) నేనేనండి వెట్టోణ్ని.

మల్ల- నువ్వా! ఎందుకురా?

వెట్టి- దొరగారు రమ్మన్నారు [illegible] అంటూరు.

మల్ల- ఏదొర?

వెట్టి- ఇనసపెక్టరుదొర.

కాం- ఎందుకు ?

వెట్టి- ఏమో ఎందుకో నాకు చెప్తారా? ఒక్క పురుగు మిగలకుండా మొగాళ్ళని అందరినీ పిలుసుకురమ్మన్నారు. రవణయ్యగారుకూడా అక్కడే వుండారండి.

మల్లి- సరే, వస్తున్నాపద.

వెట్టి- సిత్తం (వెళ్ళిపోతాడు)

కాం- ఎందుకో ?

మల్లి- నాకుమాత్రం ఏం తెలుసు ?

కాం- (భయంతో) ఏమోబాబు! మీరువెళ్ళవద్దు. నాకు ఏంటో భయంగా వుంది.

మల్లి- ఎందుకు? మాకందరికి లేనిభయం నీకెందుకు ? అయినా మన రమణారావు అక్కడేవున్నాడుగా !

కాం- అయితే, అన్నం వుడుకుపట్టింది. రెండు మెతుకులు తినిపోండి.

మల్లి- ఇప్పుడు రానూ ! (వెళ్ళిపోతాడు. కాంతమ్మ భర్త వెళ్ళినవైపు చూస్తూ ఒక నిమిషం నిలబడుతుంది. తరువాత తలపంకించి, లోనికి పోతూవుంటుంది. ఇంతలో సీతమ్మ ఖంగారుగా ప్రవేసిస్తూ)

సీత- కాంతమ్మా ! కాంతమ్మా ! అమ్మాయ్!

కాం- ఎవరూ ? (వింగులోకిచూచి) నువ్వా, ఏంటి అత్తయ్యా?

సీత- కొంపమునిగింది తల్లీ, కొంపమునిగింది.

కాం- (ఖంగారుగా) ఆఁ ఏంటి ?

సీత- ఏముందమ్మా ! ఎక్కడ చూచినా పోలీసులే !

కాం- పోలీసులా !

సీత- వూళ్లో మగాళ్ళని అందర్ని లాక్కు-పోయి కచ్చేరీ చావిడి దగ్గిర కుదరేస్తున్నారు. గొర్రెల మందను కుదరేసి నట్టు.

కాం- ఈయనగారు కూడా వెళ్లారత్తయ్యా! ఏమైపోయారో (బయటికి వెళ్ళబోతుంది)

సీత- ఆఁ ఆఁ ఆఁ పోకు తల్లి పోకు. బజారులో కనపడ్డ ఆడ దాన్ని కూడా లాక్కు-పోతున్నారంట.

(ఇంతలో తెర వెనుక నుంచి గందరగోళంగా అరుపులు, పెడ బొబ్బలు వినిపించుతాయి. కాంతమ్మ మరి రెండు అడుగులు ముందుకు వేసి తొంగి చూస్తుంది)

కాం- (రెండు చేతులతో కళ్ళు మూసుకొని) నారాయణ నారాయణ (అంటూ ముసలమ్మవద్దకు వస్తుంది)

సీత- ఏంటే తల్లి ఏంటాగోల ?

కాం- (వణికిపోతు) మగవాళ్ళనందరినీ గుడ్డలు వూడదీసి కొట్టు కుంటా బజార్లో తిప్పుతున్నారు.

సీత- (నెత్తీనెత్తీ కొట్టుకుంటూ) అయ్యో! అయ్యో! నీపాపం పాడుగాను, నీ పాపం పాడుగాను. ఇదేం పొయ్యే కాలమే.

కాం- నేను మొత్తుకుంటున్నా వినకుండా పోయారు.

సీత- పోకపోతే వూరుకుంటారా వాళ్ళు. అట్లా అనుకునే మా పెద్దవాడు ఇంట్లో కూచున్నాడు. యములోళ్ళకి మల్లే నలుగురు పోలీసులు వచ్చి లాక్కు-పోయారు బిడ్డని. నా నలుగురు కొడుకులు ఏమయ్యారో (తల బాదుకొంటూ ఏడుస్తూ వుంటుంది).

(ఇంతలో చింతాలు, ఆ వూరి బడిపంతులూ, మల్లయ్యని మోసుక్ వస్తారు. మల్లయ్య ఆ ఇద్దరి మెడలమీద చేతులువేసి, తల వ్రేలాడవేసి, కాళ్లు యీడ్చుకుంటూ, నడుస్తూ వుంటాడు. ముగ్గురి శరీరం మీద దెబ్బలు వాతలు తేలివుంటాయి. బట్టల మీద అక్కడక్కడ రక్తపు మరకలు ఉంటాయి. పంతులు చొక్కా వాలికలు వాలికలుగ చినిగివుంటుంది)

చిం- (లోనికి వస్తూనే) మంచం, మంచం (కాంతమ్మ ఏడ్చు కుంటూ మంచం వాలుస్తుంది. మల్లయ్యను దానిమీద పడుకోబెడతారు. సీతమ్మ ఒకమూల పడియున్న దిండ తెచ్చి మల్లయ్య తలకింద పెడుతుంది).

పం- మంచినీళ్ళు.

(కాంతమ్మ లోనికిపోయి గ్లాసుతో నీళ్ళు తెస్తుంది. చింతా ఆ నీళ్లను అందుకుంటాడు. కాంతమ్మ ఏడుస్తూ భర్త దగ్గరకు పోతుంది మల్లయ్య ఆమెను ఏడవవద్దని సైగచేస్తాడు. కాంతమ్మ తాటాకు విసనకర్ర తెచ్చి భర్తకు విసరుతూ వుంటుంది. చింతాలు మల్లయ్యకు నీళ్ళు తాగించ తాడు. మల్లయ్య నీళ్ళుతాగి అమ్మయ్య అంటు లేవబోతాడు. చింతాలు పంతులు ఆయనకు చేయి అందించుతారు. ఆ వృద్ధుడు లేచి కూర్చు ముందు చింతాలువైపు చూస్తాడు. తరువాత పంతులువైపు చూస్తూ)

మల్ల- మిమ్మల్నీ కొట్టారా ?

పం- మీ అందరికంటే నేను లావా ?

సీత- మీరు ఏం పాపం చేశారని కొట్టినట్టు ?

పం- ఈ గ్రామంలో తిరిగే కమ్యూనిస్టుల్ని నేను పట్టియివ్వ లేదంట.

చిం- నేను వాళ్ళని దాస్తానంట.

సీత- మా మల్లయ్య కాంగ్రేసేగా.

చిం- అయితేనేం, మాతో కలిసి కూలి చేసుకోటానికి వచ్చా రంట.

పం- కూలి పెంచమని అడిగిన కూలీలనందరిని ఇట్లాగే చావబాదారు.

కాం- అడగటం తప్పా ?

సీత- అడగండే అమ్మయినా అన్నం పెట్టదుగా ?

పం- ఆ బుద్ధి వాళ్ళకుండాలి.

కాం- రమణారావుని కూడా కొట్టారా ?

మల్లి- (వణుకుతున్న గొంతుకతో ఆయాసంగా) వాడి పేరు నా యెదట తలవకు. వాణ్ణి ఏం చేసినా పాపం లేదు.

చిం- ఆ దొర చలవే ఇదంతా ?

సీత- వూరందరి ఆస్తులు మింగినా ఇప్పటికి తీరలేదు కామాను, మనుసుల నెత్తురు కూడ తాగుతున్నాడు.

కాం- పాపం ! పంతులుగారు ఈవూరు బతకటానికి వచ్చారు. చివరికి ఆయన్ని కూడ...

పం- (ఉద్రేకంగా) నేను మనిషినై పుట్టానుగ.

సీత- అయితే ?

పం- అవును దున్నపోతులమై పుట్టినా బాగుండేదేమో ?

మల్లి- నిజమే చింతాలు. దున్నపోతులమై పుడితే దెబ్బలు తిన్నా గుడ్డలు వూడతీయించుకున్న అవమానంతో కుమిలి కుమిలి చచ్చేగతి పట్టేదిగాదు (అంటూ వుద్రేకంగా లేచి నుంచుంటాడు).

కాం- అవునుమరి, పరువు పోయినాక బతికేకంటే చస్తేనే మేలు.

చిం- (గంభీరంగా) మనమా, చచ్చేది. ప్రజలు యెప్పుడూ చావరు.

(ఇంతలో చింతాలు, ఆ వూరి బడిపంతులూ, మల్లయ్యని మోసుకు వస్తారు. మల్లయ్య ఆ ఇద్దరి మెడలమీద చేతులు వేసి, తల వ్రేలాడవేసి, కాళ్లు యీడ్చుకుంటూ, నడుస్తూ వుంటాడు. ముగ్గురి శరీరం మీద దెబ్బలు వాతలు తేలివుంటాయి. బట్టల మీద అక్కడక్కడ రక్తపు మరకలు ఉంటాయి. పంతులు చొక్కా వాలికలు వాలికలుగ చినిగివుంటుంది)

చిం- (లోనికి వస్తూనే) మంచం, మంచం (కాంతమ్మ ఏడ్చుకుంటూ మంచం వాలుస్తుంది. మల్లయ్యను దానిమీద పడుకోబెడతారు. సీతమ్మ ఒకమూల పడియున్న దిండు తెచ్చి మల్లయ్య తలకింద పెడుతుంది).

పం- మంచినీళ్ళు.

(కాంతమ్మ లోనికిపోయి గ్లాసుతో నీళ్ళు తెస్తుంది. చింతాలు ఆ నీళ్లను అందుకుంటాడు. కాంతమ్మ ఏడుస్తూ భర్త దగ్గరకు పోతుంది. మల్లయ్య ఆమెను ఏడవవద్దని సైగచేస్తాడు. కాంతమ్మ తాటాకు విసనకర్ర తెచ్చి భర్తకు విసురుతూ వుంటుంది. చింతాలు మల్లయ్యకు నీళ్ళు తాగించుతాడు. మల్లయ్య నీళ్ళుతాగి అమ్మయ్య అంటు లేవబోతాడు. చింతాలు, పంతులు ఆయనకు చేయి అందించుతారు. ఆ వృద్ధుడు లేచి కూర్చుని ముందు చింతాలువైపు చూస్తాడు. తరువాత పంతులు వైపు చూస్తూ)

మల్ల- మిమ్మల్నీ కొట్టారా?

పం- మీ అందరికంటే నేను లావా?

సీత- మీరు ఏం పాపం చేశారని కొట్టినట్టు?

పం- ఈ గ్రామంలో తిరిగే కమ్యూనిస్టుల్ని నేను పట్టియివ్వ లేదంట.

చిం- నేను వాళ్ళని దాస్తానంట.

సీత- మా మల్లయ్య కాంగ్రెసేగా.

చిం- అయితేనేం, మాతో కలిసి కూలి చేసుకోటానికి వచ్చారంట.

పం- కూలి పెంచమని అడిగిన కూలీలనందరిని ఇట్లాగే చావ బాదారు.

కాం- అడగటం తప్పా?

సీత- అడగందే అమ్మయినా అన్నంపెట్టదుగా?

పం- ఆ బుద్ధి వాళ్ళకుండాలి.

కాం- రమణారావుని కూడా కొట్టారా?

మల్ల- (వణుకుతున్న గొంతుకతో ఆయాసంగా) వాడి పేరు నా యెదట తలవకు. వాణ్ణి ఏంచేసినా పాపంలేదు.

చిం- ఆ దొర చలవే ఇదంతా?

సీత- వూరందరి ఆస్తులు మింగినా చప్పిక తీరలేదు కామాను, మనుసుల నెత్తురు కూడ తాగుతున్నాడు.

కాం- పాపం! పంతులుగారు ఈవూరు బతకటానికి వచ్చారు. చివరికి ఆయన్ని కూడ...

పం- (ఉద్రేకంగా) నేను మనిషినై పుట్టానుగ.

సీత- అయితే?

పం- అవును దున్నపోతులమై పుట్టినా బాగుండేదేమో?

మల్ల- నిజమే చింతాలు. దున్నపోతులమై పుడితే దెబ్బలు తిన్నా గుడ్డలు వూడతీయించుకున్న అవమానంతో కుమిలి కుమిలి చచ్చేగతి పట్టేదిగాదు (అంటూ వుద్రేకంగా లేచి నుంచుంటాడు).

కాం- అవునుమరి, పరువు పోయినాక బతికేకంటే చస్తేనే మేలు.

చిం- (గంభీరంగా) మనమా, చచ్చేది. ప్రజలు యెప్పుడూ చావరు.

మల్లి— గొప్ప కుటుంబంలో పుట్టాను. కావాలిసినంత బలగం వుంది. నాకేం తరుగు అనుకున్నాను. లేనిపోని ఆశలు పెట్టుకున్నాను. కుక్కతోక పట్టుకుని గోదావరి ఈదుదాం అనుకున్నాను. మునిగాను. తేలాను. నేటికి కళ్ళు తెరిచాను. చింతాలు నన్ను కళ్లు తెరిపించాడు. కాని (విచారంగా) ఇంత అవమానం జరిగినాక ఏ మొఖంతో బజారుకు పోను? చ స్తేనే మేలేమొ!

పం— (ఉద్రేకంగా) ద్రౌపది చీరవిప్పడానికి ప్రయత్నించినందుకు కౌరవుల కుటుంబం సర్వనాశనమైందని భారతం ఘోషిస్తోంది. అదే నిజమైతే మనం చావం. సీతను చెరబట్టినందుకు, రావణాసురుని కొడుకులూ మనమలూ, చుట్టాలూ, సైన్యాలూ సముద్రంలో కలిసింది. వాస్తవమైతే మనం చావం. ముమ్మాటికీ చావం.

(రేపు పొద్దున్నే 9 గంటలకి కచ్చేరీ చావిడిదగ్గిర జండావందనం జరుగుతుంది. అందరూ రావాలోహో, వూళ్ళోవున్న ఆడోళ్లు మొగోళ్లు పిల్లా బీరకాయ అంతా స్వాతంత్రందినోత్సవంలో పాలుగోనాలోహో” అంటూ చాటింపు వినబడుతుంది. అందరూ చెవులు అటు పెట్టి వింటారు.)

చిం— జండావందనం! జండా వందనానికి మొండి మొలలతో రావాలో గుడ్డలుధరించి రావాలో చాటించ రేం?

మల్లి— రెండేళ్ళనుంచి ఆ జెండాకు మొక్కాను. పూలదండలు వేశాను. టెంకాయలు కొట్టాను. ఆరతులు ఇచ్చాను. అనుభవించాను. ఫలితం అనుభవించాను. (పకపక నవ్వుతూ పంతులుకు తన పగిలిన తలను చూపిస్తూ) పంతులుగారూ! ఇదిగో ఫలితం! చింతాలూ ఇదిగో

నెత్తురు (నెత్తురుగుడ్డలు చూపుతాడు) పిన్నీ ఫలితం అనుభవించాను. అనుభవించాను. కూలివాళ్ళతో కలిసి కూలికి పోయినందుకు నాకు ఫలితం ముట్ట చెప్పారు. (భార్యవైపు తిరిగి) నెత్తురు కళ్ళచూచారంట... నెత్తుగు... సిగ్గుతీశారంట. నామైకం విడింది. చింతాలు నాకు వెలుగుచూపాడు. దారికితెచ్చాడు. నేనూ కూలివాణ్ణే. కూలివాళ్ళతోనే వుంటాను. చచ్చేదాకా కూలివాళ్ళతోనే వుంటాను. (చేతులుచాచి బిగ్గరగా) చింతాలూ, (పోయి చింతాలును కౌగలించుకుంటాడు, చింతాలు మల్లయ్యను కౌగలించుకుంటాడు).

[ తెర ]



పాత్రలు:

లక్ష్మీపతి
గురవయ్య
గోవర్ధనరావు
నారయ్య
రామయ్య
యువకుడు
మాధవరావు
దేవయ్య
మధు
మొదటి ప్రేక్షకుడు
రెండవ ,,
ఒక కూత్రవాడు
ఇద్దరు పోలీసులు
ఇనస్పెక్టర్

కాలం : 1948 ఆగస్టు 15

ప్రదేశం : ఆనందపురం పంచాయితీ బోర్డు ఆఫీసు ముందున్న ఖాళీస్థలం

సమయం : ఉదయం 8 గంటలు

[ఆనందపురం చిన్నబస్తీ, దీనికి అరమైలు దూరంలో రైలుస్టేషనూ, దానికి సమీపంలో ధాన్యపుమిల్లూ ఉన్నాయి.

ఆ బస్తీమధ్యగా రాతిరోడ్డు పోతుంది. ఈ రోడ్డు నానుకొని పోలీసుస్టేషనూ, బస్ స్టాండూ చిన్నచిన్న దుకాణాలూ, కాఫీహోటళ్ళూ ఉంటాయి. ఇచ్చటి అధికసంఖ్యాకుల ప్రధానమైన వృత్తి వ్యవసాయం.

ఈ రోడ్డుకు కొద్దిదూరములోవున్న పంచాయితీబోర్డుఆఫీసు చక్కగా అలంకరించి ఉంటుంది. మహానాయకుల చిత్రపటాలూ, మంత్రిశేఖరుల ఫొటోలు గోడలకు తగిలించి వుంటాయి. రేడియోకూడ వుంటుంది. ఆఫీసు ముందున్న ఖాళీస్థలం శుభ్రంగా ఊడ్చి, నీళ్ళుజల్లి త్రివర్ణపతాకాలతోను, మామిడి తోరణాలతోను అలంకరించి వుంటుంది.

ఆఫీసుముందు వేదిక, దానిమీద ఒక డ్రాయరూ, నాలుగుకుర్చీలూ, డ్రాయరుమీద తెల్లటి ఖద్దరు వస్త్రం పరచివుంటుంది. నూలుదండ, పూలదండలూ, పువ్వులూ, వెండి పళ్లెంలో దానిమీద వుంటాయి.

మిల్లు యజమాని లక్ష్మీపతి ప్రవేశం. గడ్డం మీసాలు నున్నగా గొరిగించి వుంటాయి. నూతన ఖద్దరు వస్త్రాలు. బిళ్ళగోచి, తొడుగుకొన్న లాల్చీ మోకాళ్ళు దిగి వుంటుంది. తలమీద తెల్లటి గాంధీటోపీ, చేతిలో వెండిపొన్ను వేసిన నల్లటికర్ర, కాళ్లకు కాన్వాసు చెప్పులు, కళ్ళకుజోడు, చేతిగడియారం, వేళ్ళకు ఉంగరాలు, అడ్డమూ నిలువు సమానం; బొజ్జ మనిషికంటె ముందు నడుస్తూ వుంటుంది. వయస్సు 40. వెనుకకు విరగబడి చేతులు త్రిప్పుకుంటూ స్టేజీలోకి ప్రవేశిస్తాడు. రేడియో న్యూస్ చెప్తూవుంటుంది. లక్ష్మీపతి న్యూస్ వింటూ స్టేజీలో పచార్ చేస్తూవుంటాడు.]

న్యూస్_ ఆలిండియా రేడియో వార్తలు. "స్వాతంత్ర్యంవచ్చిన తరువాత మనం అనేక కష్టాలు ఎదుర్కోవలసివచ్చింది. ప్రపంచ పరిస్థితులు క్షణానికొక విధంగా మారుతున్నాయి. ఏ క్షణంలో ఎక్కడ ఏం జరుగుతుందో తెలియకుండా వుంది. కనుక చేసే ప్రతి పని చాల జాగ్రత్తగా ఆలోచించి చేయవలసి ఉంటుంది. ఈ పరిస్థితులలో పరిశ్రమలను జాతిపరం చేస్తే ఉత్పత్తి కుంటుపడుతుంది. ఉత్పత్తిని పెంచి దేశాన్ని రక్షించాలంటే పరిశ్రమలు వ్యక్తుల స్వాధీనంలోనే వుండాలి. అందువల్ల కనీసం పదిసంవత్సరాలవరకు పరిశ్రమలు జాతిపరం చేయబడవు" అంటూ ప్రభుత్వం ఇదివరకే ప్రకటించింది. అంతేకాదు. వర్తకులు కోరికమీద కంట్రోళ్ళను తొలగించింది. వీరు దేశ పురోభివృద్ధికి తోడ్పడతారని ఆశించింది. కాని వర్తకుల ధరలు చుక్కలంట పెంచారు. దీన్ని ప్రభుత్వం సహించదు. వార్తలు సమాప్తి.

లక్ష్మి_ సహించదు. హ్హా. హ్హా. హ్హా ప్రభుత్వం సహిం... చదు.

[ గురవయ్య ప్రవేశం. లక్ష్మీపతి బాడీగార్డు. గండు ముఖం. దుబ్బుక్రాపు మిడిగ్రుడ్లు. రాక్షసిబొగ్గు నలుపు. ఇతడు ధరించిన ఖద్దరు పంచి మడిచిదోపి, సైకిల్ కట్టు కట్టాడు. హాఫ్‌షర్టు. టర్కీ టవల్. వయస్సు 30 ]

గుర_ సహించదా ? ఎవరినండీ సహించందీ ?

లక్ష్మి_ ఎవరినినో కాదు మనల్నే.

గుర_ ఏం ? ఎందుకని ?

లక్ష్మి- ధరలు పెంచామట !

గుర- పెంచితే వాళ్ళకేం? అందుకని మనమీదకూడా దాడి చేస్తారా ?

లక్ష్మి- అంటున్నారు కాని చేయరు.

గుర- అయితే ఈ వాగుడెందుకు ?

లక్ష్మి- ఈ పిచ్చిమూక కళ్ళనీళ్లు తుడవడానికి, బజారుల్లో గొంతులు చించుకునే వాళ్ల నోటికి కళ్లెం పెట్టడానికి.

గుర- (వికటంగా నవ్వుతూ) అవున్లే, ఇదివరకు మనల్ని ఉరి తీస్తామని పొరకాయలు కోశారు, తీశారా ? ఇదీఅంతే.

లక్ష్మి- సరే దానికేంగాని, మన దేవయ్యగారు ఇంతవరకు రాలేదు. ఎప్పుడో ప్రొద్దుననగా కారు పంపాం.

గుర- పొద్దున ఏంటి ! చీకటుండగానే పంపించాంగా.

లక్ష్మి- ఎందువల్ల నబ్బా ! ఇంకా రాలేదు.

గుర- ఆఁ ! రోడ్డు దరిద్రంగావుంది. ఆ గోతుల్లో ఎక్కడ ఏం జరిగిందో.

లక్ష్మి- వారి దేముందిలే, కాకపోతే ఇంకా కాసేపటికైనా వస్తారు. కనీసం అయిదారు వందలైనా ప్రజలు వస్తారనుకున్నాం. ఏరి ?

గుర- పనులు తీరాలిగా దొరలకి. వస్తారు, వస్తారు.

లక్ష్మి- ఏంవస్తారో, చివరకు ఆ వెధవలు బుర్రకథపెట్టినా ఊరంతా ఇక్కడే చచ్చేవారు. పోనీ మన కూలీలన్నా రాలేదేం ? వాళ్ళకేం రోగమొచ్చింది !

గుర- (వెకిలిగా నవ్వుతూ) వాళ్ళేనా అంత తక్కువ తింది ?

లక్ష్మి- మొన్న పక్కలు విరగతన్నించినా బుద్ధిరాలేదు పశువు లకి. మిల్లుమూసింది ఇళ్ళదగ్గర హాయిగా పండుకోమని గాదు. ఈ ఉత్సవంలో పాల్గొనమని.

గుర- (వ్యంగ్యంగా) వాళ్ళా పడుకోలేదులేండి పాపం! మొన్న తగిలిన దెబ్బలికి, కాపులు వేసుకుంటున్నారు. ఇక దిగుతారులేండి (ఇద్దరూ నవ్వుతూ వుంటారు).

[జమీందారు గోవర్ధనరావు ప్రవేశం. పొందూరు ఖాదీపంచ, శిల్కు పట్టు, చేతికి గడియారం, వేళ్ళకు ఉంగరాలు, క్రాఫు, కోరమీసం, హాఫ్ బూటు, చేతిలో బెత్తం, కళ్ళు ఎర్రగా వుంటాయి.]

గుర- (వింగులోకిచూచి) అదుగో దొరగారు!

లక్ష్మి- ఎవరూ (అటుజూచి) ఓహో గోవర్ధనరావుగారా! నమస్కారం దయచేయండి (షేకుహేండు ఇచ్చుకొని నవ్వుతూవెళ్లి ఇద్దరూ కుర్చీలలో కూర్చుంటారు). తమకు ఆహ్వానం ఎప్పుడందింది?

గోవ- రాత్రే మద్రాసు వెళదామని ప్రయాణం కట్టాను. ఇంతలో మీ ఆహ్వానం అందింది. ప్రయాణం మార్చాను.

లక్ష్మి- మద్రాసు పనులింకా పూర్తికాలేదా మీకు?

గోవ- ఆఁ ఆఁ అయినట్లేలెండి. దాదాపు పదిసంవత్సరాలనుంచి భూములమ్మాలని ప్రయత్నం. కాని కొనే దిక్కులేక పోయింది. దీనితో ఆపీడ వొదిలింది.

గుర- లేకపోతే ఎవడికెక్కావాలి ఆ సన్యాసిపొలాలు-మానెడు జల్లితే, సోలెడు పండవ్!

లక్ష్మి- వారికేంరా. అదృష్టవంతులు. ప్రభుత్వానుగ్రహంవల్ల లక్షలకు లక్షలు కొట్టేస్తున్నారు.

గుర- ఆమాట నిజమేకాని, ఎన్ని జెప్పినా ఇందులో ఆ జమీందారీ దర్జా రాదండి.

లక్ష్మి- ఏం ?

గుర- వెనక ఒకరైతు దొరగారి శెలవుగాకుండా రెండు తాటాకులు కొట్టుకున్నాడంట. వెంటనే దివాణానికి పిలిపించి వాడి గడ్డం మీసాలు పీకించారు దొరగారు. ఆ రైతు మొగం పూర్ణబ్బూరెలా వుబ్బింది. అయినా అదేమిటని దొరగారిని అడిగిన మొగాడు లేక పొయ్యాడు! ఎన్ని జెప్పినా ఆదర్జా వేరండి!

[జమీందారు ఎడమచేత్తో కుడిమీసం మెలివేస్తూ వుంటాడు]

లక్ష్మి- (నవ్వుతూ) అప్పుడు గడ్డం మీసాలు పీకిస్తే అడిగే దిక్కు లేకపోయింది. రేపు మిల్లుయజమానై తుపాకితో కాల్పించితే అడిగేదిక్కుండదు. నీమొఖం నీకేం తెలుసురా? (జమీందారువైపు చూస్తాడు).

గుర- ఇంతకీ, దొరగారికి పోయేదేమీ లేదంటారు ?

లక్ష్మి- ఎందుకులేదు? వుంది. వుంది.

గోవ- ఏమిటీ ?

లక్ష్మి- (నవ్వుతూ) రాజాగారనే బిరుదు.

(ముగ్గురూ బిగ్గరగా నవ్వుతూవుంటారు. కారు హారన్ మోత వినిపించుతుంది. గురవయ్య బయటికి వెళ్ళుతాడు. మిగతా ఇద్దరూలేచి ముందుకువచ్చి, అటుచూస్తూవుంటారు. గురవయ్య తిరిగివస్తాడు.)

లక్ష్మి- ఏంరా! గురవయ్యా! మనకారేనా! దేవయ్య గారొచ్చారా?

గుర- లేదు. అది పోలీసులాకి. ఎక్కడికో పోతావుంది.

గోవ- ఇవ్వాళ కాస్త హడావుడికాదూ! ఎవళ్ళరోగమో నొదిలించడానికి వెళుతూవుంది.

లక్ష్మి- (గడియారంచూస్తూ) గురవయ్యా! నీవు బస్సుకైనా వెళ్ళి, దేవయ్యగారిని తొందరగా తీసుకురారా. ఇప్పటికే చాల ఆలస్యం జరిగింది. (పర్సులోనుంచి అయిదు రూపాయల నోటు తీసి గురవయ్య కందిస్తూ) తొందరగా రావాలి.

గుర- చిత్తం (నోటు అందుకొని వెళ్ళిపోతాడు.)

(ఇంతలో పేపరబ్బాయి పత్రిక తెచ్చి లక్ష్మీపతికి అందించుతాడు. అతడు పేపరు విప్పుతాడు. పెద్దక్షరాలతో జమీందార్లకు మరి రెండు కోట్లు అను శీర్షిక ఉంటుంది.)

లక్ష్మి- (పేపరుమీద చిటిక వేస్తూ) గోవర్ధనరావుగారూ! మీ అదృష్టం పండింది...

గోవ- మావిషయం ఏమైనా వ్రాశాడా ఏమిటి? (తానుకూడ పేపరుమీదకు వంగి చూస్తాడు.)

లక్ష్మి- (చదవటంతోపాటు అక్షరాలమీద వేలు నడుపుతూ! జమీందార్లకు మరి రెండుకోట్లు, మరిరెండుకోట్లు ఎక్కడ పోస్తారండీ యీ కోట్లన్నీ!

గోవ- (చిరునవ్వుతో) తమరు కట్టించే ఆ కొత్తఫ్యాక్టరీలో... (హఠాత్తుగా వేరొక శీర్షిక చూచి) నూకే కాదండోయ్! ఈనాందార్లకు ఇరవై కోట్లు! ఇరవై!

లక్ష్మి- (తానుకూడ ఆ శీర్షిక చూచి పేపరు డ్రాయరుమీద పడేస్తూ) ఈ దరిద్రులు ఎందరు ఎన్నివాగితేనేం! కుడీ, ఎడమ–మంచీ, చెడ్డా గుర్తెరిగిన ప్రభుత్వంగాబట్టి ఇలా చేస్తూవుంది.

గోవ- ఈ ప్రభుత్వం ప్రజలకు ఏమీ సౌకర్యాలు చేయడం లేదంటూ కొందరు వాగుతున్నారు. ఈ చేసేవి సౌకర్యాలు కావూ! ప్రజలంటే ఈ పిచ్చిమూకేనా! మనం కాదూ?

లక్ష్మి- ప్రభుత్వమంటే వేరే ఎక్కడవుందీ? అదే మనం, మనమే అదీ!

[భూస్వామి నారయ్య ప్రవేశం బట్టతల, ఖద్దరు పంచ, మామూలు చొక్కా, కండువా, తగరంకట్టిన చెప్పులూ, వయస్సు 40]

లక్ష్మి- (నారయ్యను చూచి) ఓహో నారయ్యగారా! మీరు కూడా ఇంత ఆలస్యం చేశారేమిటి?

నార- డెబ్బాయి పనులు. ఏం చెప్పమంటారు! (జమీందారు వైపు వేలుచూపి) వీరు... బంధువులా?

లక్ష్మి- ఎరగరా ఏంటీ! దక్షిణ ఎస్టేటు జమీందారుగారు; మన గోవర్ధనరావుగారు...

నార- (జమీందారుకు నమస్కరిస్తూ వినయంగా) క్షమించండి. ఈ మధ్య చత్వారం ఒకటి ప్రాప్తించింది. గుర్తించలేకపొయ్యాను.

గోవ- (నవ్వుతూ) దానికేంలేండి (ముగ్గురూ కూర్చుంటారు).

నార- ఒకసారి సబ్ కోర్టుదగ్గర తమ దర్శనం చేసుకున్నాను.

గోవ- అవును.

నార- ఏమైందండీ ఆ వ్యవహారం ?

గోవ- (కొంచెం ఆలోచించి) ఓహో, హైకోర్టులో వుంది.

లక్ష్మి- వ్యవహారాల దేముందిలేండి, వస్తూవుంటాయి. పోతుం టాయి! సరేగాని నారయ్యగారూ! మొన్న మీగ్రా మానికి కలెక్టరు వచ్చాడని విన్నాను. ఏంజరిగిందీ ?

నార- జరిగేదేముంది ? ఊళ్ళోగింజ మిగలకుండా కమాండీరు చేశారు____

లక్ష్మి- ఏ గొడవా లేకుండా సక్రమంగా ఇచ్చారూ ? రైతు లేమీ పేచీ పెట్టలే ?

నార- ఏంపెడతారూ. అంతకు నాల్గురోజులు ముందేగా పోలీ సులు మెదిలిన వాడినల్లా తన్నిందీ. నోరు తెరిస్తే ఏం ప్రమాదమోనని ఎవడికివాడు చేతులు నలుపుకుంటూ వూరుకున్నాడు.

గోవ- హు! ఇష్టం వచ్చినట్లల్లా వాగటానికి, ఇది బ్రిటిషు ప్రభుత్వంకాదు. (పేపరు తిరుగ వేస్తూవుంటాడు)

లక్ష్మి- నారయ్యగారూ! 'ఈ' ఫారమున్న ధాన్యంకూడ కమాండీరు చేశాడా ?

నార- అంత మట్టుకు దక్కినాయిలేండి.

లక్ష్మి- ఇంతకూ మీ ధాన్యం సంగతి ?

నార- మనధాన్యం ఎక్కడికి పోతుంది. తమ దగ్గర 'ఈ'ఫారం తీసుకున్నానని కలెక్టరుగారికి మనవి జేసుకున్నాను____

లక్ష్మి- ఊఁ

నార- అయితే చూపమన్నారు. "ఫారం ఇనప్పెట్టెలో ఉంది. తాళంచెవి జేబులో వేసుకుని మావాడు బెజవాడ

వెళ్లాడు" అన్నాను. వారు నామాట నమ్మి "సరే నాలుగురోజులలో మళ్లీ వస్తాను అప్పటికైనా జాగ్రత్త పెట్టండి" అని శెలవిచ్చారు.

లక్ష్మి- (నవ్వుతూ) భేష్. భలే ఎత్తు వేశావయ్యా.

నార- అంటే - కలెక్టరుగారి కాఫీ, భోజనం వగైరాలు మన గృహంలోనే లెండి.

లక్ష్మి- అదా సంగతి. ఈ చిక్కు వస్తుందనే నేను ముందుగా చెప్పింది 'ఫారం' దగ్గర ఉంచుకోమని-

నార- అవును, చెప్పారు; కాని నేనే...

లక్ష్మి- ఇంతకూ ఇప్పుడు ఫారం కావాలంటారు ?

నార- అంటారేమిటి! అసలు ఇవ్వాళ రావడం, పదిపాళ్ళు అందుకే.

లక్ష్మి- సరే, అలాగే చూద్దాం.

నార- వారంరోజులనాడే తమ దర్శనం చేసుకుందామనుకున్నా. కాని తీరి చావలే.

లక్ష్మి- ఏం? నాటు సక్రమంగా పడలేదా ?

నార- మొదట పడదనే భయపడ్డాం. కాని మిగతా గ్రామాల సంగతి ఎలావున్నా, మావూళ్ళో మాత్రం సిరుటికంటె ఈయేడే సులువుగా పూర్తి అయాయి. జీతం పెంచమన్న గాడిదకొడుకునల్లా మెత్తగా తన్నించాం. దానితో తలదిమ్ము వదిలింది. తరువాత కూలి పెంచమని అడిగిన దిక్కే లేదనుకోండి.

లక్ష్మి- భేషైనపని జేశారు. దెబ్బకుగాని దెయ్యం వదలదు. ఈమధ్య మనా కూలీలుకూడ కాస్త తల వెళ్ళబెట్టారు. వెంటనే స్టేషన్ కి తెలియపర్చాను. పోలీ...

నార- (పకపక నవ్వుతూ) అయిందా ఏమిటి ఆ కాస్తపని.

గోవ- మీరు మగవాళ్ళనే కొట్టించారేమొ, మేము ఆడ ముండల్నికూడ తన్నించాం. (అంతా నవ్వుతారు)

[రామయ్య ప్రవేశం - రైతు. నీర్కావి పంచె, తలగుడ్డ, చేతిలో ములుకర్ర, కాళ్ళకు పాత చెప్పులు.]

రామ- మీలోమీరు చెవులు కొరుక్కోటమేనా, ఏమైనా మీటింగు వుందా ? ఎందాక కూచోమంటావ్ లచ్చింపతిగారూ !

లక్ష్మి. (టైమ్ చూస్తూ) ఇంకొక్క పది నిమిషాలు ఓపిక పట్టండి, ప్రారంభిద్దాం.

రామ- పదికాకపోతే ఇంకో పదినిమిషా లుంటాం - ఇంతకీ ఆయనగారేరీ ? దేవయ్యాగా రొస్తారని టముకు వేయించారుగా__

లక్ష్మి- అవును తప్పక వస్తారు.

రామ- ఏమోనబ్బా! మీరు ఎప్పుడు మీటింగు చేసినా, పెద్ద పెద్ద నాయకు లొస్తారని చెప్పడం, తీరాజూస్తే ఈదబోతే తాగ నీలుండవు. ఒక్కరూ రారు. ఆట్టే చూస్తే ఇయ్యాలా అంతేనల్లేవుంది!

లక్ష్మి- అబ్బే అదేమీకాదు. తెల్లవారు ఝాముననగా కారు పంపే. తరవాత మళ్ళీ గురవయ్యకూడా వెళ్ళేడు. వస్తూ వుండాలి.

రామ- రాకపోతే ఇయ్యాల జనం తిట్టుకుంటూ పోతారు.
నార- ఏమంత జనమొచ్చారులే, దేవయ్యగా రంతటివారు వస్తూవుంటే ! ఈ జనమేనా... ...!
యువకుడు- (ప్రవేశించి) వారు వస్తారనబట్టే యీ నలుగురైనా వచ్చారు.
లక్ష్మి- పనిరోజులు కాదూ ! అదీ నిజమేలే నాయనా, వెళ్లి కూర్చో.
రామ- కూర్చోక గంతులేస్తామంటలెండి. రెండు పాటలైనా పాడిద్దురూ.
లక్ష్మి- అలాగే ముందుకూర్చోండి.
యువ- చిత్తం.

[ యువకుడు, రామయ్య వేదిక దిగి ప్రేక్షకుల్లో కూర్చుంటారు ]

లక్ష్మి- (ప్రేక్షకుల్లోకి చూస్తూ) మాధవా! అబ్బాయ్ మాధవా !
రైతు- (ప్రేక్షకులలో నుంచి) ఇక్కడే ఉన్నాడండి.
లక్ష్మి- ఇటుపంపు నాయనా.

[ మాధవరావు ప్రవేశం. వయస్సు 15 ]

లక్ష్మి- ఒకపాట పాడరా అబ్బాయ్.
మాధ- (గొంతు సవరించుకుని "ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు" అనే పద్యమున్నూ - "కత్తులు లేవు ఖడ్గ గద గాండివముల్ మొదలే హులిక్కి" అనే పద్యం చదువుతాడు.)

[వేదికమీది ముగ్గురు ప్రముఖులు పద్యాలలోని భావానికి తన్మయులై తలలు వూపుతూ వుంటారు. మాధవరావు రెండవ పద్యంలోని తుదిచరణం

పాడుతూవుండగా, బయట కారు హారన్ వినబడుతుంది. దానితోపాటు "మహాత్మా గాంధీకి జై" అనే గురవయ్య అరుపుకూడ వినవస్తుంది. "దేవయ్యగారు", "దేవయ్యగారు" అంటూ ప్రేక్షకుల్లో కలకలం బయలుదేరుతుంది. మాధవరావు పాట ఆగిపోతుంది.

దేవయ్యగారు ప్రవేశం. కట్టుకున్న అంగవస్త్రం మోకాళ్ళపైకి వుంటుంది. భుజంమీద తుండు, నున్నగా గొరిగిన తలమీద పిలక, చేతిలో గాంధీజీ బొమ్మవున్న సంచి. లావుగా, బలంగావుంటాడు. వయస్సు 35. అతి వినయంగా ప్రజలకు నమస్కరించి 'బోలో మహాత్మా గాంధీజీకీ' అంటాడు. ప్రజలు 'జై' అంటారు. లక్ష్మీపతి దేవయ్యగారి మెడలో నూలుదండ, పూలదండ వేసి, సవినయంగా కుర్చీ చూపుతాడు.]

దేవ— (నిల్చునే) "సోదర, సోదరీమణులారా! సకాలానికి సభకు హాజరు కాజాలనందుకు విచారించుచున్నాను. అందుకు నన్ను క్షమించ ప్రార్థన. మార్గమధ్యమున కారు చెడినది. డ్రైవ రెంత తొందరపడి బాగుజేసినను వేళ కందుకోజాలమైతిమి. (గురవయ్య లక్ష్మీపతి చెవిలో యేదో చెబుతాడు).

లక్ష్మి— (నవ్వుతూ ప్రజలతో) అయ్యా! మా డ్రైవరుసంగతి అలా వుంచండి. మనమీదవుండే వాత్సల్యంతో దేవయ్య గారు స్వయంగా కారుదిగి స్టార్టయే వరకు దానిని నెట్టారట. మహానుభావులు! (కరతాళ ధ్వనులు)

దేవ— (చిరునవ్వుతో) ఇందులో గొప్ప. విశేషం ఏముందిలేండి.

(ఇంతలో ఒక యువకుడు వచ్చి కుర్చీలలో వున్న నల్గురు పెద్దలకు పూలదండలు వేస్తాడు. ఫోటో తీయబడుతుంది)

లక్ష్మి— సోదరులారా! మన దేవయ్యగారు, జమీందారుగారు, నారయ్యగారు ఇంతవరకు ఫలహారము తీసుకోలేదు.

పది నిమిషాలలో ముగించుకొనివస్తాం. అందాక ఓపికతో కూర్చుంటారని ఆశిస్తున్నాను.

దేవ- ఆఁ! ఆఁ! ఇప్పుడేం వద్దు. ముందు మీటింగు జరగనివ్వండి.

లక్ష్మి- (జమీందారు నారయ్యల వైపు జూచి) మేం కార్యక్రమం సాగిస్తుంటాం. తమరు వెళ్ళి టిఫిన్ తీసుకొని రాండి. అరే గురవయ్యా! వీరిని తీసుకపద.

నార- ఆఁ, ఇప్పుడెందుకు లెండి.

దేవ- ఫరవాలేదులే వెళ్లి రాండి. వెళ్లి రాండి.

(జమీందారు - నారయ్య గురవయ్యలు వెళ్ళిపోతారు)

లక్ష్మి- సోదరులారా! అధ్యక్షత వహించి ఈ మహాసభను జయప్రదంగా జరిపించమని మీ అందరి తరఫున మహాత్యాగులైన దేవయ్యగారిని ప్రార్థిస్తున్నాను.

దేవ- (చేతులు డ్రాయరు మీద మోపి ముందుకు వంగబడి) అల్పజ్ఞుడనూ, అజ్ఞానినీ అయిన నన్ను మీరింతగా గౌరవించుచున్నారంటే అది మీరు నాయందుంచిన అవ్యాజానురాగమే కాని వేరొండు కాదు. పవిత్రమైన యీ స్థాన మలంకరించుటకే నసర్హుడనైనను మిమ్ము గాదనలేను. మీ యాజ్ఞను శిరసావహించుచున్నాను- (సభకు నమస్కరించి కూర్చుంటాడు — కరతాళ ధ్వనులు).

(అధ్యక్షుడికి లక్ష్మీపతి ప్రోగ్రాం కరపత్రం అందిస్తాడు)

దేవ- (ఆ కాగితం అందుకుని చూస్తూ లేచి) ప్రార్థన——మధు

(మధు ప్రవేశించి దేవయ్యగారికి ప్రజలకు నమస్కరిస్తాడు. దేవయ్యగారు తన సంచిలో నుంచి ఏకు తక్లీ తీసి నూలు వడుకుతూ మధూను పాడమని సంజ్ఞ చేస్తాడు)

మధు—

రాజసమొప్ప నెవ్వడు, పురాతన కాలమునాటి యిమ్మహా
రాజుల రావణాసురుల, రాజ్యగమూమణి కందకుండ న
వ్యాజకృపాకటాక్షమున నాశ్రయమిచ్చి తరింప జేసెనో,
ఆ జననాయకాగ్రసరు, నాథును 'నా సరదారు' గొల్చెదన్.

వెళ్లిపోయావా – బాపూ,
విడచి మమ్మెల్లరను – ఎచటికో వెళ్లి॥
కులమత ద్వేషాగ్నికీజన
బలము నాహుతి జేసి తమతమ
కలిమి నిలుపు కొనంగ జూచెడి
ఖలుల కత్తికి మొదటిబలిగా వెళ్లి॥
తరతరంబుల దేశద్రోహుల
పరమ నీచుల మహారాజుల
దరియజని బేరాలు సల్పుచు
తిరుగు ప్రముఖుల ధర్మమా యనీ వెళ్ళి॥
ఘాతుకుల నరికట్టి ప్రజలకు
ఊతమివ్వాని మన ప్రభుత్వపు
చేతగాని తనంబె వైరుల
వాత నిను బడవైవ తండ్రీ వెళ్ళి॥
నిన్ను జంపిన శత్రు లేకడ
నున్న పాతాళమున దాగిన
సర్వనాశనము జేసి ప్రతినను
నిర్వహించెదమయ్య బాపూ వెళ్ళి॥

[మధు పాడుతున్నంతసేపూ, లక్ష్మీపతీ, జమీందారు, భూస్వామి కంగారు పడి బెదురుచూపులు చూస్తూవుంటారు. దేవయ్యగారు మధ్య మధ్య పడకడంఆపి మధువంక చూస్తూవుంటాడు–పాట పూర్తికాగానే మధు వేదిక దిగి ప్రజలలో కూర్చుంటాడు]

దేవ– (లేచి) సోదరులారా! ప్రఖ్యాత మిల్లుయజమానులు, దేశసేవాధురంధరులైన శ్రీ శ్రీ లక్ష్మీపతిగారు జండా ఎగురవేస్తారు.

లక్ష్మీ– (నవ్వుతూ లేచి జండాదగ్గరకు వెళతాడు. వేదికమీద పెద్దలంతా లేచి నిల్చుంటారు. లక్ష్మీపతి జండాతాడు లాగబోతాడు. ప్రజలలోనుంచి తుమ్ము వినబడుతుంది. అతడు తెల్లబోయి దేవయ్యగారివంక చూస్తాడు. ప్రక్కన ఈ దృశ్యాన్ని ఎవరో ఫొటోలాగుతారు.)

దేవ– పర్వాలేదులెండి, ఎగరవేయండి. (లక్ష్మీపతి జండా తాడు లాగుతాడు. మధ్యకు వెళ్లేసరికి దాని తాడు ఇరుసునపడుతుంది. జండా ఎటూ కదలదు).

దేవ– అలా కట్టివేయండి లక్ష్మీపతిగారు, తరువాత సరి జేసుకోవచ్చు——

(లక్ష్మీపతి జండాతాడు గడకు కడతాడు–చప్పట్లు)

దేవ– ఎవరైనా జాతీయగీతం పాడితే బాగుంటుంది.

లక్ష్మీ. ఆఁ ఆఁ పాడిద్దాం. (ప్రేక్షకులలోకి చూస్తూ)మాధవ రావ్ అబ్బాయ్ మాధవరావ్!

మాధ. (వేదికమీదకువచ్చి) నాకు జాతీయగీతం రాదండి.

(సభలోనుంచి "మధుకు వచ్చునండీ" అను కేక వినబడుతుంది.)

లక్ష్మీ– ఆఁ మధుకా – ఆఁ మధూ

దేవ- పాడితే రమ్మనండి! (మధూ వేదికమీదికి వస్తాడు.)
అబ్బాయ్ ఏగీతం పాడతావ్ 'జనగణమన'వచ్చునా ?

మధు- రాదండీ.

దేవ- 'విజయీ విశ్వతరంగా ప్యారా'

మధు- అవి హిందీ గీతమండీ.

దేవ- అయితే మరేగీతం పాడతావ్ ?

మధు-'దేశమును ప్రేమించుచున్నా !'

లక్ష్మి- (కంగారుగా) అది వద్దండీ. ఆపాట మనదికాదు.

మధు- మీదని ఎవరన్నారు. అది గురజాడ అప్పారావు పంతులుగారిది. (ప్రజలలోనుండి నవ్వు).

దేవ- ఎందుకులే నాయనా! ఈ గొడవ. నేనే పాడతాను. ఏదో ఒకటి వచ్చినవరకు (దేవయ్యగారు 'విజయీ విశ్వ తరంగాప్యారా' పాడుతూవుంటాడు. లక్ష్మిపతితోపాటు మధూ, మాధవరావులిద్దరూ చేతులుకట్టుకొని నిల్చుంటారు. పాటపూర్తికాగానే అందరూ జండావందనం జేస్తారు. తరువాత మధూ మాధవరావులు వేదిక దిగి కూర్చుంటారు. భూస్వామీ, జమీందారు వచ్చి తమ స్థానాలను అలంకరిస్తారు).

లక్ష్మి- (డాయసువద్దకు వెళ్ళి) అధ్యక్షా! ఆర్యులారా! స్వరాజ్యంకోసం మన నాయకులు, పడరాని కష్టాలు పడ్డారు. కడకుదాన్ని సంపాదించారు. ఆరోజున పూజ్యులైన దేవయ్యగారు, మనగ్రామములో అంటే ఇక్కడ ఈ జెండాను ఎగురవేశారు. ఆ దినమే, ఈ దినం. మళ్ళీ

ఈ దినంనాడు మీ కృపవల్ల ఈ జండాను ఎగురవేసే భాగ్యం నాకు లభించింది.

[ జమీందారూ, భూస్వామీ చప్పట్లు కొడతారు. తరువాత తక్లీ కిందపెట్టి దేవయ్యగారుకూడా చప్పట్లు కొడతాడు. ఆయనతోపాటు సభికులలో కొందరు చప్పట్లు కొడతారు. ]

లక్ష్మి- (గొంతు సవరించుకొని) ఇది పవిత్రమైన స్వాతంత్ర్యం. ఎందువల్లనంటారా ? ఒక్కరక్తపు చుక్కకూడ చిందకుండా, సంపాదించబడింది గనుక...

1వ ప్రేక్షకుడు- (లేచి) అదేమిటండీ అట్లా అంటారు. స్వారాజ్యంకోసం అనేకమంది యోధులు ఉరిస్తంభాలెక్కేను - రక్తం ధారపోస్తేను - అందాకా ఎందుకు, ఉప్పు సత్యాగ్రహంరోజుల్లో మీగుడ్డల కొట్టుముందు పికెటింగుచేస్తూ వుంటేనేగా, మావాడిమీద పోలీసు లాఠీతోలించింది.

లక్ష్మి- ఆఁ...ఆదీ....దీ....ఆ విషయం (దేవయ్యగారివైపు చూస్తాడు)

దేవ- (లేచి) మహాశయులారా ! దేశంకోసం మనవాళ్ళ నేకులు, ప్రాణాలు కోల్పోయిన మాట వాస్తవం. ఎవ్వరూ కాదనరు. ఎదుటివారి హృదయాన్ని కరిగించి, మార్చి, మనం స్వాతంత్ర్యం సంపాదించామని మాత్రమే ఇప్పుడు చెప్పినదాని భావం.

లక్ష్మి- అవును, అదే అదే, నానుద్దేశ్యంకూడ.

దేవ- ఉపన్యాసం మధ్యలో వారిని ప్రశ్నలు వేయవలదని నా ప్రార్ధన (లక్ష్మిపతిని జూచి) ఊఁ కానివ్వండి.

లక్ష్మి- పవిత్రమైన ఈ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవాలంటే, మనం మన నాయకులు చెప్పినప్రకారం నడుచుకోవాలి. ఇదే మన ధర్మం. అధికోత్పత్తి చెయ్యాలంటున్నారు మన పెద్దలు. కనుక అన్నపానీయాలు లేకపోయినా సరే, మనం ఆపని చేసితీరాలి. ఈ జండా ప్రతిష్ఠను కాపాడాలి. ఇంత...

2వ ప్రేక్ష- (లేచి) దొంగ వ్యాపారం చెయ్యడం దేశద్రోహమని చెప్పారు కాదండి మన నాయకులు - నిజమేనంటారా?

[లక్ష్మీపతి ఈ మాటలను విననట్లు కూర్చుంటాడు]

దేవ- (లేచి) ఇప్పుడు దక్షిణఎస్టేటు జమీందారుగారైన శ్రీ శ్రీ గోవర్ధనరావుగారు మాట్లాడుతారు.

గోవ- (లేచి) మహాజనులారా! నేను...ఊఁ- ఊఁ- దాదాపు పాతిక ముప్పై మైళ్లు కారు ప్రయాణం చేసి అలిసినాను. తలనొప్పిగా ఉన్నది. మాట్లాడ లేకుండా ఉన్నాను. క్షమించ వేడుచున్నాను.

దేవ- పర్వాలేదు మాట్లాడండి.

గోవ- (నమస్కరిస్తూ) క్షమించండి దేవయ్యగారు క్షమించండి (కూర్చుంటాడు).

[ప్రజలలోనుంచి చప్పట్లు - ఎవరో ఈలవేస్తారు.]

దేవ- (విసుగుగా) ఎవరది?

లక్ష్మి- ఎవరో కమ్యూనిస్టువాడు లేండి___

దేవ- (లేచి) సోదరులారా! రైతుబిడ్డ నారయ్యగారు మాట్లాడుతారు-

నార- ఎందుకులెండి తమరు మాట్లాడండి దేవయ్యగారు. మేము రోజూమాట్లాడే వాళ్ళమేగా-

దేవ- అదేమిటి? మాట్లాడండి నాలుగుమాటలు.

[(ప్రేక్షకులలోనుండి కేకలు 'నారయ్యగారు మాట్లాడాలి' 'మాట్లాడాలి']

నార- (చేతులు నులుపుకుంటూ లేచి) సోదరులారా! కాలం అమూల్యమైంది. దానిని వృధా చేసుకోగూడదు. కనుక నా సమయాన్నికూడా దేవయ్యగారే వినియోగించు కోవడం బాగుంటుంది - ఇలాంటి మహనీయులు ఎల్ల ప్పుడూరారు. వీరిచ్చే అమూల్యమైన సందేశాన్ని విని మనం నేర్చుకోవలసిన వెన్నోవుంటాయి. కనుక క్షమించి నన్నింతటి విడిచిపెట్టండి. (కూర్చుంటాడు)

దేవ- (కరతాళ ధ్వనుల మధ్యలేచి ఉపన్యాసం ప్రారంభించ బోతూ వుంటాడు. ఇంతలో మధు ఒకకుర్రవాడిని లాక్కొచ్చి దేవయ్యగారి ముందు నిలబెడతాడు).

దేవ- ఎవరితను?

మధు- ఇందాక ఈలవేసిన కమ్యూనిస్టు.

లక్ష్మి- ఎందుకు వేశావురా, ఈల? ఎవరువేయ మన్నారురా గాడిద! (చేయి ఎత్తుతాడు).

కుర్రవాడు- మరండి ... మరండి ... మీ అబ్బాయిగా రెయ్య మన్నారండి.

లక్ష్మి- పో వెధవ అవతలకు. (దేవయ్యగారితో) వీడు మా గురవయ్య కొడుకులెండి (కుర్రవానితోపాటు మధూ కూడ నవ్వుతూ వెళ్లిపోతాడు.)

దేవ- మహాజనులారా! సాధుపుంగవుడు, భారత జనని నోముల పంట, శాంతిదూత, అహింసా వ్రతధారి, హరిజనోద్ధారకుడు, మన కల్పతరువు, మన గురువు, మన బోసినోటితండ్రి, మనబాపూ మనలను వీడినాడు. స్వర్గ మలంకరించినాడు.

రామ- కాదండీ! వాడెవడో ఆ తండ్రిని కాల్చిచంపాడుగా.

దేవ- కాదు, కాదు, తప్పు, తప్పు. అతడు నిమిత్త మాత్రుడు. ఆ మహనీయు డొకరిచే చంపబడుటయా! ఆదివ్య మంగళ విగ్రహుడు తమ యవతారమును చాలించి నాడు. భౌతిక శరీరమును త్యజించినాడు.

ఆ మహాత్ములు ప్రపంచమున కొక నూతన సందే శము నిచ్చినారు. అంతేగాదు. ఒక దివ్యఖడ్గమును కూడ ప్రసాదించినారు. అదే, అదే, అహింసా ఖడ్గము. అది రవియ స్తమించని బ్రిటిష్ సామ్రాజ్యము నుర్రూత లూపినది. తుదకు లొంగదీసినది.

మధు- అంతభయంకర శత్రువును లొంగదీసిన దివ్యఖడ్గం చేతిలోవుండగా, మనవాళ్లు మన ప్రజలమీాద హింసా ఖడ్గాన్ని ప్రయోగిస్తున్నారు. ఎందువల్ల నండి ?

[లక్ష్మీపతి, గురవయ్యనుపిల్చి అతని చెవులో, ఎదో చెపుతాడు. గురవయ్య ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, తల పంకిస్తూ వెళ్ళిపోతాడు]

దేవ- ఎల్లప్పుడూ దాన్ని ప్రయోగించుటకు వీలుపడదు. సమయా సమయము లుండును.

రామ- ఆ సమయం ఎట్లాటిదో కాస్త శెలవిస్తారూ? ఈ పాపపు చెవల వింటాం.

దేవ- తాతగారూ, చక్కనిప్రశ్న యడిగినారు. వినండి. నైజాం నరకాసుర ప్రభుత్వము తమ ప్రజలను దారుణముగా హింసించుచున్నది. అచ్చటిరజాకార్లు గ్రామాలనుకొల్ల గొట్టుచున్నారు. తెలుగుతల్లుల నవమానించుచున్నారు. అహింసా కృత్యముల నరికట్టుటకు మహాత్ముని ప్రియ శిష్యులైన భన్సాలీగారు పూనుకొనినారు. ముష్కర నైజాము పరిపాలితగ్రామాలలో ప్రవేశించి సత్యాగ్రహము చేసినారు. కడకు నిరశనవ్రతము పూనినారు.

మధు- ఏమండీ! దేవయ్యగారూ! ఒక్క నైజాంలోనేనా, లేక అలాటి దారుణ హింసాకాండ ఎక్కడజరిగినా, నిరశన వ్రతానికి పూనుకుంటారా?

[జమీందారు, భూస్వామి మధ్య మధ్య చెవులు కొరుక్కుంటూ వుంటారు]

దేవ- నిజమైన సత్యాగ్రహి అట్టి దారుణ హింసాకాండ లెక్కడ జరిగినా సహించడు. నిరశనవ్రతము చేసితీరును.

రామ- అయితే ఇక్కడకూడ జరుగుతున్నయ్‌గా కొట్టటాలూ, చెరచటాలూ ...

మధు- జరుగుతూఉంటే చూస్తూ వూరుకుంటారా దేవయ్యగారు! అలా ఎప్పటికీ జరగదు రామయ్యతాత! కొద్ది రోజుల్లో తప్పకుండా నిరశనవ్రతానికి పూనుకుంటారు.

దేవ- పొరపాటు. ఇక్కడట్టిపని చేయ పూనుకొనరాదు.పూనుకొనము.

రామ- అదేమిటండీ! అట్లా మాట్లాడుతారు ? మీబోటి పెద్దలకుకూడా రెండు నాలికలా !

[ఇంతలో ప్రేక్షకులలోనున్న మధు, రామయ్యగార్ల సమీపానికి ఇద్దరు పోలీసులు చేరుకుంటారు]

దేవ- (విసుగ్గా) సోదరులారా! నేను మరియొక మహాసభకు హాజరుకావలసియున్నది. కాబట్టి మీ ప్రశ్నలన్నిటికి తగిన సమాధానమిచ్చుటకు వ్యవధిలేదు. (ఏకులూ, తకిలీ సంచిలో సర్దుకుంటూ) నేను ముఖ్యముగా మీకు రెండు విషయములు చెప్పదలచినాను. అందొకటి మన జాతీయ ప్రభుత్వమును బలపర్చుట. రెండు: ఈ జండా పరువుప్రతిష్టలను కాపాడుట. మీరీ రెండుకార్యముల దీక్షొదరని యాశించుచున్నాను. (సభకు సమస్క-రిస్తూ) సెలవు.

[వేదిక దిగుతాడు. ఆయనను సాగనంపడానికి లక్ష్మీపతి, భూస్వామి, జమీందారు లేస్తారు. అంతా కలసి బయటికి వెళతారు. రెండవవైపు నుంచి గురవయ్య ఇనస్పెక్టరు స్టేజీలోకి ప్రవేశిస్తారు. ఇనస్పెక్టరు చేతిలో 'హంటర్' వుంటుంది. ప్రేక్షకులలోకి ప్రవేశించిన పోలీసులు మధు, రామయ్యగార్లను పట్టుకుంటారు.]

పోలీసులు- నడవండయ్యా. నడవండీ! ఇనస్పెక్టరుగారు రమ్మంటున్నారు.

మధు-
రామ- } ఏం, ఎందుకు?

పోలీసులు- ఎందుకో, ఏమిటో, అక్కడ తెలుస్తుంది ముందు నడవండి!

ప్రేక్షకులలోనుంచి కొందరు- వెళ్ళండయ్యా, వెళ్ళండి. అదే మిటో చూద్దాం!

[పోలీసులతోపాటు ఆ ఇద్దరూ, తెరవెనుకకు పోతూ వుంటారు)

గుర_ (మధువైపు వేలుచూపుతూ) వాడె, ఆ మొనగాడె. మన లక్ష్మీపతిగారి ఫ్యాక్టరీలోని కూలీల సంఘానికి పెద్ద.

ఇన_ (తలపంకిస్తూ) అసలు కూలీలు ఏరి ? ఒక్కడూ సభకు రాలేదేం ?

గుర_ ఏమో ఎటు చచ్చారో ఒక్కడురాలా.

ఇన_ (రామయ్యగారిని వేలితో చూపుతూ) ఈ ముసలి పీనుగ ఎవడు ?

గుర_ ఈవ్వారే, కూటికి గుడ్డకులేని ఒక బక్కసన్యాసి, రైతు.

[ఇంతలో పోలీసులు, మధు, రామయ్య తెరవెనుకకు వస్తారు. ఇనస్పెక్టరు తానుకూడ లోనికివెళ్ళి—]

ఇన_ (బిగ్గరగా) ఈ గాడ్దెల రెక్క లంటగట్టండిరా.

[పోలీసులు వారి రెక్క లంటగడుతూ వుంటారు. స్టేజీలోని గురవయ్య నవ్వుతూ వుంటాడు _ తెర నెమ్మదిగా జారుతుంది.]



పాత్రలు :

చెన్నారెడ్డి

గురవయ్య

సుబ్బయ్య

రంగారావు

కనకయ్య

సమయం : ఉదయం 8 గంటలు

(రంగాపురం ఒక పల్లెటూరు. ఊరిమధ్య నాలుగు బజారులు కలిసిన చోట విశాలమైన ఖాళీస్థలం. దానిలో ఒక కచేరి చావడి. దానికి ఎదురుగా ఖాళీ స్థలంలో ఒక పెద్ద వేపచెట్టు. ఆ చెట్టు చుట్టు గచ్చుచేసిన పెద్ద అరుగు. తీరిక సమయంలో చిన్నా పెద్దా అక్కడికి చేరుతారు. ఆచెట్టు కిందనే పెద్దలు గ్రామతగాదాలు పరిష్కారం చేస్తుంటారు.

ప్రజలంతా కలిసి ఒక రేడియో పెట్టుకున్నారు. చెట్టుకు ఒక లౌడ్ స్పీకరు అమర్చబడింది. చెన్నారెడ్డి చిన్నరైతు. ఆ అరుగుమీద కూర్చుని తాడు పేనుకుంటున్నాడు. అతని వయసు 40. గడ్డం మాసింది. చొక్కా లేదు. నీరుకావిపంచ ధరించాడు. పైన ఉత్తరీయం.

గురవయ్య నిరుపేద రైతు. వయసు ముప్పయి అయిదు. బనియన్ తొడుక్కున్నాడు. కాళ్లకు పాతచెప్పులు, పైన పంచ.)

గురవయ్య– (ప్రవేశించుతూ) ఏం చెన్నారెడ్డి బావా! అంతూ పంతూ లేకుండా తాళ్ళు వేస్తన్నవ్?

చెన్నారెడ్డి– మా కర్రికోడె తాళ్లు బతకనివ్వదు గురవయ్యా! నిన్నగాక మొన్న కొత్తతాడు వేశాను. అప్పుడే తెగ గొట్టింది. సరేగాని... ఏమిటి ఇట్టా బయలుదేరావ్!

గుర– నీకోసమే బావా!

చెన్నా– నా కోసమా? ఎందుకు?

గుర– మరేం లేదు. రేపు కాస్తి కాడి పంపిస్తావేమోనని...

చెన్నా– ఇంకా నాలుగు బళ్ళు ఎరువు వుంది. రేపు తోలాలనుకున్నా నే.

గుర- (అరుగుమీాద నారఅందుకొని చీల్చి చెన్నారెడ్డికి అందిం చుతూ) మర్నాడు తోలకూడదూ ?

చెన్నా- ఎప్పుడైనా తోలవచ్చు. కానీ నీకు అంత అవసరమైన పని ?

గుర- వంకమడ్డిచేలో వి_త్తనం వేద్దామని.

చెన్నా- వి_త్తనమా ? పదునయిందీ ?

గుర- ఆఁ అదే పదును. ధైర్యంచేసి వేస్తే మొలవకపోతుందా అని.

చెన్నా- పదును బాగా అయినాకనే వెయ్యగూడదూ? అంత తొందరెందుకు ?

గుర- ఇరుగుపొరుగు వాళ్ళంతా వే_స్తున్నారు.

చెన్నా- ఏం వే_స్తున్నారో. వేలం వెర్రికి వెనకాముందూలేదు.

గుర- ఏదోలే బావా ! పదిమందితో చావు పెళ్ళితో సమాన మంటారుగా.

చెన్నా- ఇట్టాగే; వాడు వే_స్తున్నాడని వీడూ, వీడువే_స్తున్నా డని వాడూ తీసుకుపోయి ఆ బంగారంలాంటి వి_త్తనాలు మట్టిలో కుమ్మరిస్తున్నారు.

గుర- ఆమాటా నిజమే. ఇంతకీ ఏమంటావ్ ?

చెన్నా- పదును బాగా అయినాకనే పైరు వెయ్యటం మంచి దంటాను.

గుర- అంతా వే_స్తున్నారుగా.

చెన్నా- తోటివాడు తొడకోసుకుంటే మనం మెడ కోసు కొంటామా !

గుర- ఎందుకు కోసుకుంటాం. కాని గింజ భూమిలోపడితే తర వాత నాలుగు చినుకులు పడకపోతయ్యా అని ఆశ.

చెన్నా- పడితేసరే. పడకపోతేనో! ఆశ గోసిలోకి చిప్ప చేతిలోకి రావలసిందేగా.

గుర- ఆఁ మనదేపాటిబావా? అంతా నాలుగెకరాలు. కాని వాడి దుంపతెగ సావుకారు కొండయ్య ఎకరాలకు ఎకరాలు వేస్తన్నాడు.

చెన్నా- కొండయ్య నిజంగా ఒకకొండ. ఎంతైనా వేస్తాడు. అందుకని నువ్వూ వేస్తావా? పులినిజూచి నక్కవాత పెట్టుకున్నట్టు.

గుర- ఆయనతో మనకేం పోటీ? ఆ మారాజుకి ఒకమూల పండితే ఎంత? పండకపోతే ఎంత?

చెన్నా- అందుకే, నేనూ చెప్పేది...

గుర- సరేలేబావా! నీ మాట ఎందుకు కాదనాలి. పెద్ద వాడివి. కాకపోతే నాలుగురోజులు వెనక.

చెన్నా- ఏం వెనక. ముందు ఇంకా బోలెడెంతకాలం ఉంది.

(రామారావు ప్రవేశం. వయసు ఇరవైఅయిదు. చదువుకున్నాడు. చామనచాయ. చిన్నక్రాఫు. మీసం. ఆఫ్‌షర్టు. భుజానతుండు.)

గుర- (రామారావువైపుచూచి) ఊరికి పోయావన్నారే, రామారావుబాబూ!

రామా- అవును మామా!

గుర- ఎప్పుడు రావటం ?

రామా- పొద్దున.

చెన్నా- ఎక్కడికి పోతేనేం ? సరిగ్గా పేపరుటయానికి అందు కున్నాడుగా.

గుర- ఈ బాబు ఊళ్లో లేకపోతే ఏమీతోచదు. పెపంచంలో ఏమూల ఏంజరుగుతాఉందో చెప్పేదిక్కే ఉండదు.

చెన్నా- ఎనకటికి ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కుతా నందంట. పెపంచందాకా పోయావ్. మనకు సరీగా మనవూళ్లో సంగతులు తెలియవుగాని.

గుర- నిజమే, సదువుకున్నామా సచ్చామా.

చెన్నా-అవునా, రామారావ్! మళ్లీయుద్ధంవచ్చిం దంటన్నారు.

రామా- నిజమే.

గుర- ఎక్కడబాబూ !

రామా- కొరియాలో.

చెన్నా- ఎవ రెవరికి ?

రామా- వాళ్ళల్లో వాళ్ళకే.

గుర- అదేంటి ?

చెన్నా- పోయే కాలం.

రామా- గడచిన యుద్ధానికి పూర్వం...

గుర- అంటే రష్యా - జర్మనీ యుద్ధానికి ముందా ?

రామా- అవును.

చెన్నా- అయితే ?

రామా- అప్పుడు ఈకొరియా, జపానువాళ్ళ పెత్తనం కింద వుండేది. ఆ జపాను ఫాసిస్టులు కొరియా ప్రజలను పెట్టిన బాధలు ఇన్నీ అన్నీకాదు. ఆ యుద్ధం ముగియ టంతో పాటు కొరియా విముక్తి కూడా జరిగింది.

గుర- జరిగిందీ !

చెన్నా- అయితే ఇప్పుడు తన్నుకు చావటం దేనికి ?

రామా- అప్పుడు దానిని ఉత్తరకొరియా అనీ, దక్షిణకొరియా అనీ రెండు ముక్కలుగా విడగొట్టారు. దక్షిణకొరియా ప్రభుత్వం కేవలం అమెరికా తొత్తు.

గుర- అయితే బలే ఇముక్తి.

చెన్నా- ఇదివరకు కొరియాను జపానువాళ్ళు పీక్కుతిన్నారూ, ఇప్పుడుఅమెరికా నాయాళ్ళు తయారయ్యారు. ఏడ్చినట్లే ఉంది.

గుర- మరి ఆ రెండోదాని సంగతేంటి బాబు !

రామా- అంటే ఉత్తర కొరియా సంగతా ? అది అలాంటిది కాదు. అది...

(సుబ్బయ్య ప్రవేశం. వయసు ముప్పయి. చిరిగిన చొక్కాకు అక్కడక్కడ మాసికలు వేసి ఉంటాయి. మాసిన గడ్డం, తలగుడ్డ చుట్టుకొంటూ విచారంగా లోనికి ప్రవేశిస్తాడు.)

రామా- (అతనివైపు తేరిపారజూస్తూ) ఏంటి సుబ్బయ్యా ! అట్లాఉన్నావు.

గుర- (నార అందించటం ఆపివేసి ఆదుర్దాగా) ఏదో కొంప మునిగినట్లే వుంది.

చెన్నా- (తాడు పేనటం ఆపి, లేచి ముందుకు వస్తూ) అవతారం చూస్తే అట్లాగే వుంది. ఏంటి సుబ్బయ్యా !

గుర- అట్లా సూత్తావేం ? చెప్పరా బాబూ !

సుబ్బ- ఏం చెప్పమంటావ్. మాను అరకలు తోలిపెట్టి నువ్వు ఇటు వచ్చావ్. చేలోకిపోయి మేము అరకలుకట్టామో లేదో రంగారావుగారు వచ్చి ఊడదీయించాడు.

గుర- ఊడదీయించటమే !

సుబ్బ- ఊడదీస్తే నయమే. ముక్కలు ముక్కలుగా విరగ కొట్టించాడు.

రామా- ఎవరు ? మా అన్నా ?

సుబ్బ- ఆ దొరే.

గుర- ఓరి నీ పాపం పాడుగాను.

చెన్నా- అసలు ఏం జరిగిందో చెప్పు సుబ్బయ్యా ! మన రామారావు అట్టాంటి వాడు కాదుర్రే.

సుబ్బ- అందుకనే ఈ బాబుతో......

గుర- చెప్పరా, చల్లకొచ్చి ముంతదాయటం ఎందుకు ఇంకా ?

రామా- ఉన్నది ఉన్నట్టు చెప్పు సుబ్బయ్యా ! నీ కేమీ భయంలేదు.

సుబ్బ- మీరు కలిగినవాళ్లు, మేంలేనివాళ్ళం. ఏదో బతుకుదా మనేగా మీ పొలాలు కవులుకు తీసుకుంది ?

చెన్నా- అదెవరు కాదంటారు ?

రామా- అవును నిజమే.

సుబ్బ- మీడబ్బు మీకు ఎప్పటికప్పుడే ఇస్తున్నాం. అందులో ఏపైరు ఏసుకుంటే మీ కెందుకు ? అంతేగా ?

చెన్నా- అంతగాక ఇంకెంత.

సుబ్బ- అంతే అయితే "నాభూమిలో దొరపొగాకైనా ఎయ్యండి; లేకపోతే అరకలు ఊడతీసుకొని అవతలికి పోనన్నా పొండి" అంటాడూ?

గుర- అంటాడు అంటాడు. నిన్నటిదాకా దున్ని, డొక్కి ఇయ్యాల అవతలికి పోవాలి?

చెన్నా– రాజ్యం ముండ ఏల్తాందనుకున్నాడా ? ఇదేం విపరీతం రామారావ్ ?

రామా– వినాశకాలం దాపురించి.

చెన్నా– అట్టాగే ఉంది.

గుర– అదికాదు బావా ! జొన్న వేసుకుంటే గొడ్లకు ఇంత మేత, మనుషులకు ఇంతతిండి దొరుకుతుందని మా ఏడుపు.

చెన్నా– అందరి ఏడుపూ అదే. రోజూ ఈ రేడియో మొత్తుకు నేది వినటంలా తిండిగింజలు పండించమని.

రామా– మొత్తుకునేది అదికాదు.

గుర– మరి ?

రామా– నాయకులు.

సుబ్బ– (విసుగ్గా) అంతా నాయకులే – వినాయకులు. చివరికి సావుకారు కొండయ్యకూడా నాయకుడేనాయె, ఇంత పొడుగు చొక్కా తొడుక్కొని.

రామా– అదెంత పని సుబ్బయ్యా ! తలచుకుంటే రేపీపాటికి మనము నాయకులు గావచ్చు.

గుర– అదెట్టా ?

చెన్నా– ఏ రోటికాడపదం ఆ రోటికాడ పాడితే సరి.

సుబ్బ– (నవ్వుతూ) నిజమే. ఆ పొట్టోడు కొండయ్యను చూడ రాదూ. తెల్లోడుండగా రావు బహుద్దూర్ అనిపించు కున్నాడు. ఇప్పుడు దేశభక్తుడయ్యాడు.

రామా– ఇల్లాంటి రకాన్ని చేరనివ్వబట్టే......

చెన్నా– చేరితే ఎందుకు ఉండనివ్వాలి; పీకిపారెయ్యక.

రామా- నిజమే; కాని వేసినవి త్తనం చచ్చి చేను అంతా కలుపు వేసిందనుకో.

చెన్నా- వేసిన కలుపు యేరేసి, ఉండ మొక్కల్ని బతికించు కోమా?

గుర- ఏం బతికించుకుంటాం చేనంతా బీడేసిపోయినాక.

సుబ్బ- బీడేస్తే తిరగదున్ని ఇంకో పైరు వేసుకుంటాం. అంతే గాని......

చెన్నా- పోనియ్యరా నూరు మాటలైనా బొక్కెడు కొర్రలు గావు. ముందు మీా సంగతి తేల్చుకోండి.

గుర- ఏం తేల్చుకుంటాం బావా! పుగాకుతినేది కాదాయె. లేకపోతే అదే కూలబెడుదుం.

సుబ్బ- ఏంటి కూలబెట్టేది పిడకలా? పొగనారు యకరం ఇన్నూరు.

చెన్నా- ఇన్నూరుగాదు మున్నూరు మొదలు దొరికితే!

గుర- ఏంటిబావా! నువ్వూ అట్టాగా మాట్లాడతావ్ అంత ధరపెట్టికొనే ఓపికే ఉంటే ఈ ఏడు పెందుకు?

చెన్నా- అదీ నిజమే. ఓ ఈ ముక్క ఆయనతోనే అంటే బాగుండేది. ఏమనేవాడో?

సుబ్బ- ఎందుకు అనలా!

రామా- అంటే ఏమన్నాడు?

సుబ్బ- ఏమన్నాడా? కొండారెడ్డి దగ్గరబండ్లకు ఉందంట. కావలిస్తే ఇప్పిస్తాడంట.

గుర- ఆ దేవుడిదగ్గరా! అయితే రెండుచేతుల్తో ఇవ్వతిన్నట్టే!
సుబ్బ- అయిదారుడూళ్ళ భూమి ఆకట్టుకున్నాడు. కోటికి పడిగ ఎత్తాడు. ఇంకా ఆశ తీరలేదు.
రామా- వాడి ఆశ తీరడానికి ఇంకా ఎన్నికొంపలు కూలాలో.
గుర- మొన్న మా చుట్టాలు దొరపుగాకునారు కావాలని వచ్చారు. ఈ సామిదగ్గర దొరుకుతుందంటే పోయి అడిగాను. యకరం మూడువంద లన్నాడు.
చెన్నా- ఓరి నీ నారు పాడుగాను. ఏమన్నా పాలుబోసి పెంచాడా?
రామా- కాదు బాబాయి! కూలీల చమటపోసి——
సుబ్బ- అప్పుడే ఏమయింది. ఇంకాఉండయి ఆదొర గొంతెమ్మ కోరికలు.
చెన్నా- ఇంకానా!
గుర- ఊం! బేరనుడుంటే సరేనంట. లేకపోతే ఆ పండిన పొగాకు అంతా తనకే అమ్మాలంట.
చెన్నా- అయితే ఇంకెందుకు తిరపతి మంగలాడు?
సుబ్బ- ఓరి నీ పిచ్చిగాల. వాడు నోరిగితే మళ్లీ మొలుస్తుంది. ఈ కొండయ్యకత్తి పడిందో, ఇక అంతే.
చెన్నా- (రామారావుతో) అయితే తెలియక అడుగుతాను. వీళ్లు దొరపొగాకు వేస్తే మీ అన్నకు ఒరిగేదేంటి? జొన్న వేసుకుంటే ఒరగని దేంటిరా!
రామా- అందులో ఒరిగేదీ లేదు, పోయేదీలేదు.
చెన్నా- అయితే ఈ రంగరామాయ దురద అంతా దేనికంట.
రామా- ఆ కొండారెడ్డి మెప్పుకోసం.

చెన్నా- వాడి మెప్పుకోసం దేవురించాల్సిన గతేం పట్టిండి మీకు ? ఉందగా ఇంత, పెద్దలు సంపాయించింది.

రామా- అత డొక పెద్దవ్యాపారి. అందులో ఒక అణాపాలు ఈయనకూ ఇస్తానని ఆశ చూపాడు. అందుకని వాడు దూకమన్న గోతిలో దూకుతున్నాడు.

గుర- అదా కత !

సుబ్బ- ఇక ఈ దొరకూడా పెద్దమేడ కడతాడన్నమాట.

చెన్నా- మట్టి కడతాడు. లోగడ ఊళ్లో రవంత మంచిపేరు ఏడిసింది. ఈ దెబ్బతో అది కాస్తీ గోవిందకొడతంది.

రామా- గురవయ్య మామా ! ఇక మీరు పోయి ఆ చేలో మీ ఇష్టంవచ్చిన పైరు వేసుకోండి. పైన నేనున్నాను.

సుబ్బ- ఏం ఉండావో, ఆ గాడిదకొడుకులు కర్రలు తీసుకొని మీదకు దూకుతున్నారు.

చెన్నా- మీదకే !

రామా- వాళ్లెవరు ?

సుబ్బ- కొండారెడ్డి మేపుతున్నాడుగా ఒక రౌడీ మూకని.

చెన్నా- వాళ్ళకి మరీ కళ్ళు పసరులు వేసినయి. మొన్న గోపాలపురంమీదకూడ ఇట్టాగే పడ్డారు.

రామా- పడ్డారు. పక్కలు విరగ దన్నించుకున్నారు.

సుబ్బ- అవును. ఆ ఊరిజనం అంతా ఏకమై ఎదురుతిరిగి నాలుగు పుచ్చుకున్నారు. ఇక చూడు నాయాళ్ల తిప్పలు !

చెన్నా- దెబ్బకు గాని దెయ్యం వదలదు.

రామా- ఎక్కడైనా అంతే, ఇల్లాంటి వెధవల బతుకు.

సుబ్బ- (గురవయ్యతో) ఎద్దులకు మేపు కూడా వెయ్యాలా. గాటికి కట్టేసి ఇటు వచ్చాను.

చెన్నా- తెల్లారితే వాటితోనేఉంది మన బతుకు. పదండి గురవయ్యా !

గుర- సరే.

రామా- పదండి. మీరు మాత్రం ధైర్యంగా నిలబడాలి.

గుర- ఏమో బాబు, నిన్నే నమ్ముకున్నాం.

సుబ్బ- ఎప్పుడైనా ఒకనాడు సచ్చేదేగా.

రామా- మరేం భయంలేదు.

[ రైతులు వెళ్ళిపోతారు. ]

[చెన్నారెడ్డి నార చీల్చుకుంటున్నాడు. రామారావు దీర్ఘంగా ఆలోచిస్తూ పచారు చేస్తున్నాడు.

చెన్నా- అట్టే చూస్తే మీ అన్నకు మతి పోయినట్టుంది.

రామా- కాదు; ఇదంతా దొంగలు దొంగలు కలిసి ఊళ్లు పంచుకొనే ప్లాను.

చెన్నా- అంత మాట అనకు. ఎక్కడ గిల్లుకున్నా మనకే నొప్పి.

రామా- అట్లా అనుకోబట్టే తొందముదిరి ఊసరవిల్లి అయింది. ఏదో ఒకటి తేల్చుకోవాలిసిందే.

చెన్నా- కాని నువ్వుమాత్రం తొందరపడకు.

రామా- (తలపంకిస్తూ) సరే.

చెన్నా- కనకయ్యగారున్నారుగా పెద్దవాడు. ఆయనతో చెప్పిచూడు, ఎందుకైనా మంచిది.

[కనకయ్య ప్రవేశం. లావుగా, ఎర్రగా ఉంటాడు. ఖద్దరుబట్టలు, లాల్చీ ధరించాడు. చేతిలో వెండిపొన్ను వేసిన కర్ర. కాళ్ళకు చెప్పులు, బట్టతల, వయసు అరవై.]

రామా- (అటుచూచి) అదుగో, కనకయ్యగారు కూడా వస్తున్నారు.

చెన్నా- నిండా నూరేళ్లు రండి కనకయ్యగారూ! కూర్చోండి.

కన- ఇంకా నలభై యేళ్లు బతకమంటావ్ ?

చెన్నా- మళ్లీమాట్లాడితే మరొక నూరేళ్లు బతకమంటాను.

కన- ఎందుకు బాబూ!

రామా- ఊరు అన్నాక బోలెడన్ని పేచీ లుంటాయి. ఎవరు తీరుస్తారు అవన్నీ ?

కన- పేచీలంటే జ్ఞాపకం వచ్చింది. (రామారావు వైపుతిరిగి) ఆ పేద ముండాకొడుకులు దాదాపు పదేళ్ళనుంచీ మీ భూములు చేసుకొని బతుకుతున్నారు. తీరా కాలం నెత్తిమీదకు వచ్చినతరువాత భూములు వదలిపెట్టి పొమ్మంటే ఎక్కడికి పోతారురా అబ్బాయి వాళ్ళు ?

చెన్నా- ఈ సంగతి అప్పుడే మీదాకా వచ్చిందీ ?

కన- ఇప్పుడే దారిలో ఎదురుపడి ఆ గురవయ్య లబ్బున మొత్తుకున్నాడు.

రామా- ఇప్పుడు మేం మాట్లాడే విషయంకూడా అదే. మీరైనా చెప్పిచూడండి మా దొరకు.

కన- చెప్పటాని కేంగాని మీ అన్న పెంకిమనిషి. ఒక ఎత్తున వింటాడా అని.

చెన్నా- మీారు చెప్పటమూ వినకపోవటమూనా? ఉంగరాల చెయ్యి పడ్డాక......

కన- బాగా చదువుకున్నాడు. ఒక పుట్టలో పెడితే వెయ్యి పుట్లల్లో తేల్తాడు.

రామా- తేల్తే అనుభవిస్తాడు.

చెన్నా- ఇంతకు ఊళ్ళో మీామాట కాదనేవాడు లేడు. అత డొక్కడు కాదని ఏ ఊరు పోతాడు?

రామా- పట్లోకి.

కన- సరే మీామాట ఎందుకు కాదనాలి? నేనూ చెప్పి చూస్తాను.

చెన్నా- తొందరగా తేల్చండి. ఈ అదునుపోతే ఇంతలో మళ్ళీ పైరు పడదు. కడకు రైతులు ఎందునా కాకండా పోతారు.

కన- రంగారావు పదిఊళ్ళ పాపరాజు. ఇంటిదగ్గర ఉన్నాడా అని.

రామా- నేను వచ్చేటప్పుడు ఉన్నాడు.

కన- ఉంటే ఇక్కడికి రావలసిందేనే.

[రంగారావు ప్రవేశం. వయసు ముప్ఫయి. చిన్న క్రాపు, పిలుక్కషర్టు, కళ్లకు అద్దాలు, కాళ్ళకు స్లిప్పర్సు.]

చెన్నా- (అటుచూస్తూ) అడుగో వస్తానే ఉండాడు.

కన- ఎవరు? రంగారావా?

రంగా- (ప్రవేశించి) అవును నేనే కనకయ్యగారూ! ఏమిటి విశేషం?

కన- మరేం లేదు; ఆ గురవయ్యవాళ్ళ వ్యవహారం......

రంగా— ఓహో అదా! వాళ్ళను ఇప్పుడు మనం కనబడేటట్టు లేం.

కన— ఊఁ మిడికారు.

రంగా— కాదులెండి. ఈమధ్య వాళ్ళకు ఒళ్లు నీరుపట్టింది.

రామా— మనం చేసిన ఘనకార్యం బాగానే ఉంది. పైగా వాళ్ళ కేదో నీరుపట్టిందట.

రంగా— ఘనకార్య మేంటి?

రామా— ఏమిటా! రైతుల అరకలు ఊడదీయించడం.

రంగా— అది నా ఇష్టం.

రామా— ఊఁ నీ ఇష్టం.

రంగా— నోరుముయ్. నా ఇష్టంగాక నీ ఇష్టమా?

రామా— అవును, నా ఇష్టమూ ఉండాలి.

కన— గృహం గుట్టూ రోగం రట్టూ అన్నారు. కాస్త నెమ్మదిగా మాట్లాడుకోండి.

చెన్నా— అవును. గుట్టుచెడ్డ సంసారం కోలుకోదు. ఒకరు కోటికి మరొకరు పేటికి లాగితే ఎట్లా ఏడుస్తుంది.

రంగా— ఈ అలుసు చూచుకొనే ఆ వెధవలుకూడా ఎదురు తిరుగుతున్నారు.

రామా— నీవు దూకమన్న గోతిలో దూకకపోవటం ఎదురు తిరగటం కాదు.

రంగా— కాదో అవునో, నాలుగురోజులు ఓర్చుకుంటే అదీ తేలుతుంది.

కన— ఏమిటా తొందర రంగారావు? అయినా ఎల్లకాలం ఒకే తీరుగా జరుగుతుందా?

చెన్నా_ ఎట్లా జరుగుతుంది. అత్తకాలం కొన్నాళ్ళు, కోడలి కాలం కొన్నాళ్లు.

కన_ అందుకే మనమూ కాలాన్ని కనిపెట్టి తిరగాలి అంటాను.

చెన్నా_ సరేగాని రైతులు కవులుపైకం సరిగానే చెల్లిస్తున్నారుగా రంగారావు?

రామా_ ఆ. పువ్వుల్లో పెట్టి.

చెన్నా_ (రంగారావుతో) అయితే అందులో వాళ్లు ఏ పైరు వేసుకుంటే మీ కెందుకు బాబూ!

రంగా_ ఇవ్వాళ వెయ్యమన్న పైరూ వెయ్యరు. చూస్తూ ఊరుకుంటే రేపు ఇవ్వాల్సిన కవులూ ఇవ్వరు.

కన_ ముందెప్పుడో ఇవ్వరని ఇవ్వాళనే వాళ్ళమీద దాడి చేస్తారా?

చెన్నా_ అట్లయితే లోకం మెచ్చదు.

రామా_ మెచ్చనీ, మెచ్చకపోనీ. ఆ కొండారెడ్డి మెచ్చుకుంటాడుగా, చాలదూ!

రంగా_ నీ బ్రతుక్కుతోడు కొండారెడ్డిగారికి వంక బెట్టబోతున్నావా?

చెన్నా_ ఆయనెక్కడ? పెద్దపులి.

రామా_ కనుకనే తన గ్రామాల్లోని మనుషుల్ని పీక్కుతింటున్నాడు.

రంగా_ నీలాంటి వెధవలు వాగితే ఆయనకు లెక్కా_ జమా.

కన_ ఆయన గొడవ మీ కెందుకు? మీది మీరు తేల్చుకోక.

రామా_ ఆ మహానుభావుడి స్నేహాఫలితం ఊరకే పోతుందా?

రంగా– ఆయన స్నేహం నీలాంటి పక్షులు కావాలంటే దొరకదు.

రామా– మంచిస్నేహం. అతనిని నమ్మినవాడెవడూ బాగు పడలేదు.

రంగా– నీలాగా ఈ చెత్తా కాని రకాన్ని నమ్మినవాడేనా బాగు పడేది ?

చెన్నా– అసలు సంగతి తేలకుండా మీ రిద్దరు పోట్లాడుకుంటే లాభం ?

రామా– ఇదంతా లాభానికి వచ్చిందా బాబాయి ?

రంగా– లాభమో నష్టమో; వాళ్లుమాత్రం నా భూమిలో అడుగుపెట్టడానికి వీల్లేదు.

రామా– ఎందుకని ? వాళ్ళకు ఆ హక్కుంది.

రంగా– హక్కా? అయితే నీవు దున్నిస్తావా?

కన– మాటకు మాట తెగులు, నీటికి నాచు తెగులు. ఎందుకు అట్లా రెట్టించుకుంటారు.

చెన్నా– పదిమందికి బుద్ధి చెప్పాల్సినవాళ్లు మీరే ఇట్లా గుద్దులాడితే ?

రామా– చెప్పుడుమాటలు విని పుట్టినబుద్ధికి......

రంగా– (కోపంగా) ఏమిటీరా, నీవు కూసినకూత ?

కన– చాలు, అంత ఆగండి.

రామా– నిర్దయగా రైతుల గొంతులు కోస్తూవుంటే చూస్తూ ఊరుకోవడం ఎట్లాగండీ?

రంగా– అయితే వాళ్ళతో నీవు భూములు దున్నిస్తావన్నమాట!

రామా– ఎవరూ దున్నించనక్కర్లా వాళ్లే...

రంగా— చేలో అడుగుపెట్టనియ్యి తెలుస్తుంది. పక్కలిరగ దన్నిస్తాను.

రామా— తన్నించావులే !

రంగా— అడ్డంరా తెలుస్తుంది. నీ బతుకు వాళ్ళ బతుకు ! (అంటూ రివ్వున పోతాడు.)

చెన్నా— ఇంత కోపమైతే ఎట్లా ఏడుస్తుంది.

కన— నాకు ముందే తెలుసు చెప్పిలాభంలేదని.

రామా— మీ మాట మీరు దక్కించుకున్నారు.

చెన్నా— చెప్పాల్సినమాట చెప్పారు. ససేమిరా పీక కోసు కుంటానంటే కోసుకోనియ్యి. మన తెడ్డేం పోయింది.

కన— ఎందుకుపోదు; పాపాయిపీడ పదిమందికి చుట్టుకుంటుంది.

చెన్నా— ఎందుకు చుట్టుకుంటుంది. తాగినవాడే పెడతాడు తాళ్ళపన్ను.

కన— కొంపకు నిప్పుఅంటుకున్నాక ఆ ఒక్క దానితోనే పోతుందా ?

రామా— మనం పదిమందిమి పూనుకుంటే ఆ కొంపను ఆర్పటం ఒక లెక్కకాదు. అంటించినవాడి ఆట కట్టించవచ్చు కూడా (బయలుదేరుతూ) వస్తాను. కాస్త పనిఉంది. (వెళతాడు)

చెన్నా— ఆపని జరిగితే ఊరిపీడే విరగడవుతుంది.

కన— నిజమే. కాని "తెంప త్యాడులేని రకాన్నంతా రెచ్చగొట్టి మావాడు కొంపకుతిప్పలు తెచ్చాడు" అంటాడు అన్న. "మా అన్న షావుకారు కొండయ్య చంకకింద దూరి వాడు ఎగరమన్నట్లల్లా ఎగురుతున్నా డంటాడు"

తమ్ముడు. అంతా గుమ్మడికాయ అంత ముత్యాలే. ఇక మనం కట్టించేది ఎవరి ఆటనంట ?

చెన్నా– పేదవాళ్ళమీద విరుచుకుపడటం తగదని రామా శావు ఉద్దేశం. అదితప్పా ?

కన– అది తప్పు అని మనిషి అయి పుట్టినవాడు ఎవ్వడూ అనడు. కాని...

చెన్నా– ఉఁ, కాని ?

కన– ఆ పెద్దమనిషి కొండయ్యను, అతడిమనుషుల్ని దుండగు లనటం, దోపిడీగాళ్ళనడం తగదు.

చెన్నా– తగదనుకుంటే కుండ పగలగొట్టినట్లు ముఖంమీద అడగండి. తప్పేముంది ?

కన– లేదనుకో, కాని కరవమంటే కప్పకుకోపం, విడవమంటే పాముకుకోపం. ఎందుకొచ్చిన పీడ ?

చెన్నా– మీరు చెప్పాలిసినమాట చెప్పాలిగాని ఎవరికో కోపం వస్తుందని ఊరుకుంటే ఎట్లా ?

కన– అట్లాయితేనే వ్యవహారం కుదిరేది.

చెన్నా– ఏది, పాము చావకుండా బడితె విరగకుండా మాట్లాడి తేనా ?

కన– అవును. అసలు మన సిద్ధాంతమే అది.

చెన్నా– బలే ! అయితే యవారం కుదిరినట్టే!

కన– తప్పకుండా కుదురుతుంది. సరియైన మార్గంలో నడిస్తే.

చెన్నా– అదే తెలియటల్లా.

కన– మనది మధ్యమార్గం.

చెన్నా- అంటే, ఇటు అత్త ఇంటికి అటు పుట్టింటికి కాకుండా నన్నమాట.

కన- అవును; అప్పుడే శాంతి కుదిరేది.

చెన్నా- శాంతి కాదు; చెర్లో మన్ను. ఒక పక్క కొంపలారి పోతుంటే!

కన- అది జరగకుండా కాపాడటంలోనే వుంది, మన గొప్ప తనం.

చెన్నా- ముక్కు మూసుకొని జపం చేయటంకూడా గొప్పతన మేనా?

కన- (విసుగ్గా) అదికాదు చెన్నారెడ్డీ! వాళ్ళ నిద్దర్నీ మెసల కుండా తొక్కిపట్టాలి.

చెన్నా- అదెట్టా?

కన- ఇట్లాగే.

చెన్నా- ఈ గుంట చిక్కులన్నీ నాకు తెలియవు. ముక్కుకు సూటిగా చెప్పు స్వామీ!

కన- (నవ్వి) అయితే విను, ఎటు తిరిగీ ఈ నాలుగైదు ఏళ్ళనుంచేగా మన వూరు కాస్త వూరుగా ఉంది. అదివరకేముంది! ఎప్పుడూ ఆ తెల్ల దేవరపల్లి దొరలతో తన్నులాటేగా.

చెన్నా- అవును.

కన- అట్లాంటి గ్రామాన్ని ఈకాడికి తెచ్చేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది. ఇందులో నీకు తెలియంది ఏముంది?

చెన్నా- నాకేం తెలుస్తుంది. అదంతా మీకు తెలియాలి, తప్పితే ఆ... దే... వు... డి... కి తెలియాలి.

కన- మా కష్టం కాస్త ఫలించిందిగదా అనుకున్నాం. ఇంతలో మళ్ళీ ఈ తద్దినం వచ్చిపడింది. దీన్ని మొగ్గలోనే తుంచి వెయ్యాలి. లేకపోతే కోతిపుండు బ్రహ్మరాక్షసి అవుతుంది.

చెన్నా- అదీ నిజమే. కాని...

కన- వాళ్ళ సంగతి నీకు తెలియదు చెన్నారెడ్డీ! రంగారావే అనుకుంటే వాడికంటే ఏడాకులు ఎక్కువ చదివాడు ఈ రామారావ్. పెత్తనంకోసం తన్నుకు చస్తున్నారు.

చెన్నా- అంతే నంటారా?

కన- ముమ్మాటికి అంతే.

చెన్నా- అయితే ఈ సిగపట్లగోత్రం తప్పదంటారు.

కన- ఎందుకు తప్పదూ? నేను చెప్పిన ప్రకారం మీ రంతా నిలబడితే రేపీపాటికి ముక్కుకు తాడుపోసి వాళ్ళని దారికి లాక్కురావచ్చు.

చెన్నా- సరేలేండి, అల్లాంటి వీలుంటే ఆపనే చేద్దాం. కాని వాళ్ళు వింటారా అని...

కన- మనం పదిమంది ఏకమై కాదుకూడదంటే వినక చస్తారా?

చెన్నా- వింటే సరేవుంది, వినకపోతేనో......

[ఆదుర్దాగా గురవయ్య ప్రవేశం]

చెన్నా- ఏంటి గురవయ్యా! మళ్ళీ వచ్చావ్?

గుర- రామారావ్ ఏడి?

చెన్నా- ఇప్పుడే అటు పోయాడు.

గుర- ఎక్కడికి పోయాడో?

కన- మీా ఇళ్ళకే అనుకుంటాను. ఎందుకు గురవయ్యా! అంత ఖంగారు పడుతున్నావ్ ?

గుర- ఏం చెప్పమంటావ్ బాబూ! మానోట్లో మన్ను పోశాడు రంగారావుగారు.

చెన్నా- ఏం చేశాడు ?

గుర- మేము చేసుకునే భూమి సావుకారు కొండయ్యకు కౌలు రాశాడు.

చెన్నా- కౌలా! రాయటమా!

కన- ఇదివరకు మీారు రాయించుకోలేదా ?

గుర- తెల్లటివన్నీ పాలే అనుకున్నాం. ఆయన తియ్య తియ్యని మాటలు నమ్మాం.

చెన్నా- అవును మరి. మనుష్యుల్ని నమ్మక మాకుల్ని నమ్ముతాడూ!

గుర- నమ్మినందుకు నిలువునా మా గొంతుకోశాడు బావా

కన- ఇప్పు డనుకుంటే లాభం! ఆ తెలివి ముందే వుండాలి.

చెన్నా- పాపం ! పేదముండాకొడుకులు ఏదో పొరపాటు చేశారు. అయిపోయింది. ఇప్పుడు ఏం చేస్తే మంచి దంటారు?

కన- నన్నడిగితే ఆ భూమికీ ఆయనకూ ఒక దణ్ణం పెట్టి మరొకటి చూచుకోవడం మంచి దంటాను.

గుర-భూమి వదులుకోమంటన్నారా ?

కన- ఏం చేస్తారు వదులుకోక. ఆ కొండయ్యతో పేచీ పెట్టు కుంటారా ?

చెన్నా_ ఆరుగాలం ఎద్దులూ మనుషులూ రెక్కలు ముక్కలు చేసుకొని బోలెడంత బలం తోలారు. ఇప్పుడు వదల మంటే ఎట్టా వదలుతారండీ!

కన_ ఆ మాటా నిజమే. కాని లిఖితపూర్వకమైన ఆధారం ఏది లేదు. వదలక ఏంచేస్తారు చస్తారా?

గురు_ (ఉద్రేకంగా) అంతకాడికివస్తే చావనన్నా చస్తాం కాని పొలం వొదులుకుంటామా!

చెన్నా_ (జాలిగా) పిచ్చోడ! చచ్చి ఎవర్ని సాదిస్తావ్.

గుర_ బతికి బావుకచచ్చేదిమాత్రం ఏముంది బావా! ఎప్పుడో ఒకనాడు చావాలిసిందేగా.

కన_ ఇంతమాత్రానికే చావాలా! సరిగ సేద్యము చేసేవాడు ఉండాలిగాని, కౌలుకిచ్చేవాళ్ళు కావలసినంతమంది, మన ఊళ్లో.

గుర_ రేపు, ఆ దొరలైనా చేసేది ఇంతే - నట్టేట్లో ఫుట్టి ముంచటమేగా!

కన_ సరే, ఏంచేస్తానంటావ్ ఇంతకీ ?

గుర_ అది తెలిసి చస్తే ఇట్టా ఎందుకుంటాం?

చెన్నా_ ఏదో ఒకటి చేయక తప్పదుగా.

గుర_ చేసేదేముంది బావా! పదిమందిలో పెడదాం. కనకయ్యా లాంటి పెద్దలయినా నాయం చెప్పకపోతారా!

కన_ అసలు ఇట్టాంటి తగవులంటేనే నాకు గిట్టదు. తల చిటచిట లాడుతుంది. ఈ పీడమాత్రం నాదగ్గరికి వద్దు.

గుర_ మీరే ఆ మాటంటే ఇక చేసేదేముంది. కోర్టుకి పోతాం.

కన_ ఏ ఆధారం లేంది కోర్టువారుమాత్రం ఏంజేస్తారు ?

చెన్నా- అయితే ఈ రైతులకు తోడ్పడే దిక్కే లేదన్నమాట.

[రామారావ్ ప్రవేశం]

రామ- ఎందుకులేరూ ? ఉన్నారు.

చెన్నా- ఎవరు ?

రామా- ప్రజలు.

గుర- వచ్చావా బాబూ !

రామా- మీరు ఏమయ్యారో తెల్సుకుందామని అటు వెళ్లాను. జరిగిందంతా విన్నాను.

గుర- విన్నావా ? మరి మాగతి ?

రామ- భయంలేదు. మీరుమాత్రం, ఈ కొండయ్యగారు - ఆ ఏడుకొండలవాడు దిగివచ్చినా, చేలో అడుగుపెట్ట నివ్వకండి. నా సంతకంలేని ఈ కౌలు ఎట్టా చెల్లు తుందో చూస్తాను.

కన- ఏం చూస్తావ్ ఒక్కడివి.

గుర- అదేంటి బావా మేమంతా చచ్చామా ?

రామ- (నవ్వుతూ) సరే. పద మామా! సుబ్బయ్యను చేను దగ్గరకు పంపాను. మిగతా వాళ్ళను ఎటూ పోనివ్వకు. అంతా ఇండ్ల దగ్గ రే వుండండి — ఎందుకైనా మంచిది.

గుర- అట్టాగే బాబు. (వెళుతూ వుంటాడు)

చెన్నా- గురవయ్యా ! (అతడు వెనుకకు తిరుగుతాడు) ఉడుకు నెత్తురు. కుర్రాళ్ళు తొందరపడతారేమో కనిపెట్టి వుండు.

(గురవయ్య తలపంకిస్తూ వెళ్లిపోతాడు)

రామా- విన్నారుగా కనకయ్యగారూ, మావాడుచేసిన ఘన కార్యం!
కన- వినటాని కేంలే. శాస్త్ర నిదానించటం మంచిది.
రామా- నే నేమీ తొందరపడటంలేదే.
కన- అయితే ఎందుకూ ఈ హంగామా? నా మాటవిని ఏదో పరిష్కారం చేసుకోండి.
రామా- మీరు చెయ్యండీ. అందుకు నేను ఎప్పుడూ సిద్ధమే.
చెన్నా- నీ మాటగాదు. నీ అన్న వినాలిగా!
రామా- (కనకయ్యతో) మళ్ళీ యింకొకసారి ప్రయత్నించి చూడండి.
కన- ఏమోనబ్బా!
చెన్నా- చెపుతారనుకో. మీవాడు వినాలిగా.
రామా- వినకపోతే కనకయ్యగారు కూడ న్యాయం తరఫున నిలబడతారు.
చెన్నా- (కనకయ్యవైపు చూస్తూ) ఏమండీ?
కన- ఆలోచిస్తాను—ఆలోచిస్తాను.

(మెల్లగా వెళ్ళిపోతూ వుంటాడు. రామారావు తదేకధ్యానంగా అటుచూస్తూ వుంటాడు.)

చెన్నా- కనకయ్యగారు ఎటూ వుండడనుకుంటాను.
రామా -ఎందుకని?
చెన్నా- ఆయన మిమ్మలనిద్దరిని ఒకే గాటకట్టేడు.
రామ- (తల పంకిస్తు) అట్లాగా...మరి మీమాట?
చెన్నా- ఆఁ...నాదేముంది బాబు—లెక్కలోవాణ్ణా జమలోవాణ్ణా?

రామ- అదేమిటి బాబాయ్! నీకు మాత్రం తెలియని దేముందీ.

చెన్నా- తెలుసుననుకో......అయినా ఎందుకీ గొడవ. ఇంటి గుట్టు లంకకు చేటు బాబు.

రామా- అందుకే ఇంతకాలం ఓపికపట్టింది. ఇంతకీనీమాటేమిటి?

చెన్నా- అంతకాడికివస్తే...

[ఇంతలో హడావిడిగా సుబ్బయ్య ప్రవేశం. ముఖంమీద కారిన రక్తపు మరకలుంటాయ్. కళ్ళు ఎర్రగా ఉన్నాయ్. బట్టలమీదకూడా రక్తం మరకలు]

రామా- (ఆదుర్దాగా) ఏంటి సుబ్బయ్యా! (అతని ముఖంమీది రక్తాన్ని తుడుస్తాడు)

సుబ్బ- పది అరకలు కట్టుకొని ఆదొంగ నాయాళ్ళు వచ్చి పడ్డారు.

రామ- పడి ?

సుబ్బ- మనచేలో మద్దిచెట్టు నీడను కూర్చున్నాను. ఆ మూక వచ్చిరాగానే ముందు (నెత్తురు చూపుతూ) ఈ పని చేశారు. పైన, పోయి నీ దిక్కున్నకాడ చెప్పుకో మన్నారు.

చెన్నా- (ఆశ్చర్యంగా) ఓరి గాడిద కొడుకులు!

సుబ్బ- (కర్రసలుపుతూ) ఇంకెందుకు బాబూ బతికీ—వాళ్లు చేను దున్నుతున్నారు.

రామా- (ఉగ్రుడై) వాళ్ళ చావో మనచావో ఇవాళ తేలాలి. (రివ్వున బయటికి పోతాడు. అతనితోపాటు సుబ్బయ్య కూడ. చెన్నారెడ్డి వాళ్లు పోయినవైపుచూస్తూ కొంత

తడవు నుంచున్నాడు. తదుపరి అరుగుపైనున్న నారా, తాడుతీసి కట్టగట్టుకుంటూ బయలు దేరుతాడు).

[కనకయ్య – రంగారావుల ప్రవేశం]

రంగా– ఏం బాబాయ్ వెళ్ళుతున్నావ్ ?

చెన్నా– ఎద్దులు నీళ్ళుతాగలా. ఇప్పుడేవస్తా.

రంగా– తప్పక రావాలి.

[చెన్నారెడ్డి సరేనన్నట్టు తలవూపుతూ వెళ్ళిపోతాడు]

రంగా– కొండయ్యగారికి మీరంటే ఎంత గౌరవం !

కన– (నవ్వుతూ) అది వారిదయ.

రంగా– స్వయంగా వారే బయలుదేరారు. ఇంతలో ఏదో పని తగిలింది. అందువల్ల ఉత్తరం పంపించారు.

కన– ఈ మాత్రానికి వారు రావాలా ? ఉత్తరం లేకపోతే మాత్రం వారిమాట కాదంటానా ?

రంగా– ఆ సంగతి నాకు తెలుసు ననుకోండి. కా...ని...

కన– లోకం కదూ !. కాస్త కనిపెట్టి తిరగకపోతే...

రంగా– అనేక చిక్కులుంటాయ్. ఆ మాత్రం నాకు తెలియ దంటారా ?

కన– ఏం లేదుగాని కొంచెం తొందరపడుతున్నామేమో అని.

రంగా– లేదులెండి. ఇదివరకు ఈ రైతులు తంతే కిక్కురుమనే వాళ్లు కాదు. కాని ఇప్పుడు...

కన– ఆ కాలం వేరు.

రంగా– ఏ కాలమైతేమాత్రం ! ఆ సుబ్బయ్య చూడండి. గుడ్డి గవ్వ ఖరీదు చెయ్యడు. "తూ" అంటే "తా" రాదు. నన్నెదిరిస్తాడా ?

కన- ఏడిశాడు !

రంగా- మీరుకూడ అలా మాట్లాడతారేమిటి! వీళ్ళు ఇవ్వాళ నా మాటకు ఎదిరించారు ? రేపు మిమ్మల్ని ధిక్కరిస్తారు.

కన- అదీ నిజమే.

రంగా- మీలాంటివాళ్ళు ఏ నలుగురో తప్ప వూరంతా వాళ్ళ తరఫునే చచ్చారు.

కన- ఏముందీ గొర్రెదాటు !

రంగా- సరే వెళ్తాను ? అక్కడేం గందరగోళం జరుగుతూ వుందో.

కన- కాస్త చెన్నారెడ్డితో కూడా మాట్లాడి...

రంగా- మీరున్నారుగా. శెలవు. (వెళ్లును)

[కనకయ్య ఇటూ అటూ తిరుగుతూ దీర్ఘంగా ఆలోచిస్తూ పచారు చేస్తూ వుంటాడు. చెన్నారెడ్డి వస్తాడు.]

చెన్నా- ఏంటి ఆలోచిస్తున్నారు.

కన- ఆఁ...మరేం లేదు. రంగారావు నీకోసం చూచి చూచి ఇప్పుడే అటు వెళ్ళాడు.

చెన్నా- నేనూ తొందరగానే వద్దామనుకున్నాను. తీరా ఇంటికెళ్లి చూస్తే జీతగాడు రాలా. ఏమయ్యాడో కనుక్కుందామని అటు వెళ్లాను.

కన- జీతగాళ్లు మాట వినేరోజులు ఎన్నడో పోయినై ...ఇంతకీ ఉండాడా ?

చెన్నా- వాడేమిటి! వూళ్లో మొలతాడుగట్టినమొగవాడులేడు.

కన- లేక ఏమయ్యారూ ?

చెన్నా- ఏమయ్యా రేంటి ?
కన- (ఆలోచించి) ఓహో!
చెన్నా- మొత్తంమీద ఏదో గొడవ జరిగేటట్టేవుంది.
కన- అవును. ఈ అన్నదమ్ముల పేరుమీద.
చెన్నా- అదేమిటి ? కయ్యానికి కాలుదువ్వింది రంగారావుగా.
కన- ఏంటి దువ్వింది ?
చెన్నా- ఏమిటా ? కొండయ్య అండ దొరికిందని, అడ్డగోలుగా అరకలు తోలించకొస్తాడు !
కన- అతను తొందరపడ్డాడే అనుకో, ఇతడు చేసినపనిమాత్రం ఏమంత సంబడంగా వుంది ?
చెన్నా- వచ్చి మీదకు దూకుతూవుంటే ఏం చేస్తాడు ?
కన- ఏంటి చెన్నారెడ్డీ ! మూతీ గడ్డాం నెరిసింది. నీవు అట్లాగే మాట్లాడతావేంటి ? నలుగురిని పంపి అరకలు కూడ దీయించి అవతలికి తగిలితే పోదూ ! ఈ కాస్తదానికి...
చెన్నా- ఆ మాత్రానికే అవతలకి పోయేవాళ్ళయితే సుబ్బయ్యని ఆపని చేస్తారా ?
కన- ఆ తిక్క ముండాకొడుకు ఏం వాగాడో ?

[ రామారావు ప్రవేశం ]

చెన్నా- ఏం జరిగిందిరా బాబు ?
రామా- ఆ కుక్కల్ని తరిమి కొట్టాం.
కన- (ఆశ్చర్యంగా) కొట్టడమే !
రామా- అంతేగాదు, మనవాళ్ళు తలకొక నాగలి కట్టి ఆ భూమిలో పైరుకూడా వేస్తున్నారు.
చెన్నా- బలే పని ?

కన- ఇల్లలకగానే పండగ కాదు. వారికి కావలసినంత ధనబలం ఉంది.

రామా- మనకు జనబలం ఉంది.

కన- ఉంటే లాభం? డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు.

చెన్నా- అదేంటండీ! "బలవంతమైన సర్పము, చలిచీమల చేతచిక్కి చావదె సుమతీ" అన్నాడు.

కన- పోవోయి, ఈ పోస్కోలు కబుర్లు నాకేం చెబుతావ్.

రామా- (ఆశ్చర్యంగా) ఏమిటి మీా ఉద్దేశ్యం?

చెన్నా- దాసుడి తప్పు దండంతో సరి అంటే బాగుండేదని.

కన- ఇవ్వాళ అనకపోతే రేపు అంటారు.

చెన్నా- అదేంటి కనకయ్యగారూ! మీాకూ రెండు నాలికలా! నాతో చెప్పిందేంటి? ఇప్పుడనే దేంటి?

కన- (చికాకుగా) ఏంటి నీతో చెప్పింది?

చెన్నా- మనం ఎటూ ఉండవద్దని.

కన- ఇప్పుడు మాత్రం.

చెన్నా- ఏంటో, ఇదంతా డొంకతిరుగుడుగా ఉందిగాని... ...

రామా- అవును బాబాయి! మాటలకీ చేతలకీ సంబంధం ఉండాలని ఎక్కడుంది?

[హడావుడిగా ఒక రైతు ప్రవేశం]

రైతు- బాబు! రామారావు బాబు! (అంతా అటుచూస్తారు మన గురవయ్యని, సుబ్బయ్యని పోలీసులు అరెస్టు చేశారు.

చెన్నా- ఆఁ!
రామా- ఎందుకు ?

[రంగారావు ప్రవేశించుతాడు. రైతు వెళ్ళిపోతాడు]

రంగా- శాంతి భద్రతల రక్షణకు!...ఎన్ని సంచులు తగలేశాడు కొండయ్య ?

చెన్నా- వాడు తలుచుకుంటే ఎన్నైనా తగలేస్తాడు. లెక్కా జమా!

రామా- లోకం కళ్లు తెరిచింది. డబ్బుతో రాజ్యమేలే రోజులు గతించాయి. వీడి బ్రతుకు బండారం కొద్ది రోజుల్లోనే బయటపడుతుంది.

రంగా- (కోపంగా) ఏంటిరా ?

కన- ఉండండిరా అబ్బాయి! ఏంటా తొందర ?

రామా- ఏమిటండీ మీ మాటలు ? ఇవ్వాళ మాదయింది. రేపు మీదవుతుంది.

చెన్నా- ఎల్లుండి నాదవుతుంది.

రంగా- ఇంకేం ? నువ్వూ తయారయ్యావ్ ఈ వెధవకి జత ?

రామా- తప్పకుండా తయారవుతాడు. ఈయనేకాదు, ఇలాంటి చెన్నారెడ్లు వేలకువేలు తయారవుతారు. మీ ఘాతక కృత్యాల్ని సర్వనాశనంచేసి తీరతారు.

రంగా- ఏడిశారు. చేనుకాడికి రండి. డొక్క పగలతీయకపోతే ...(వెళ్తాడు)

రామా- సరే పద. (పోబోతాడు, రేడియో వినపడుతుంది.

ఆలిండియా రేడియో తెలుగులో వార్తలు.

(రామారావు టక్కున ఆగి చెవి ఒగ్గుతాడు. కన కయ్య, చెన్నారెడ్లు కూడా వింటూ ఉంటారు)

యుద్ధవివరాలు. టోకియోవార్త. చైనా, ఉత్తర కొరియన్ సేనలు ప్రాణాలకు తెగించి ముందుకు వస్తున్నాయి. మిత్ర రాజ్య బలాలు శత్రువుకు విపరీత నష్టం కలిగించి నిర్ణీత ప్రణాళిక ప్రకారం వెనక్కు తగ్గుతున్నాయి. అమెరికన్ బాంబర్ విమానాలు అగ్నివర్షం కురిపిస్తున్నాయి. పట్టణాలు దగ్ధపటల మవుతున్నాయి. ఎక్కడ చూచినా ఉత్తరకొరియన్ల శవాల గుట్టలే.